డూండీ రూపకల్పనలో మరో మరపురాని కథ

త్రిమూర్తి ప్రొడక్షన్స్ వారి

# అభిమానవతి

స్క్రీన్‌ప్లే. దర్శకత్వం: డూండీ

నిర్మాతలు: జి. సాంబశివరావు పి. బాబ్జీ.



శ్రీఫిలింస్

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**

**Rule *8* (Form IV), Newspapers (Central) Rules, *1956***

| | | |
|---|---|---|
| 1. *Place of Publication* | ... | 'CHANDAMAMA BUILDINGS'<br>2 & 3, Arcot Road<br>Vadapalani, Madras-600 026 |
| 2. *Periodicity of Publication* | ... | MONTHLY<br>1st of each calendar month |
| 3. *Printer's Name* | ... | B. V. REDDI |
| *Nationality* | ... | INDIAN |
| *Address* | ... | Prasad Process Private Limited<br>2 & 3, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 4. *Publisher's Name* | ... | B. VISWANATHA REDDI |
| *Nationality* | ... | INDIAN |
| *Address* | ... | Chandamama Publications<br>2 & 3, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 5. *Editor's Name* | ... | CHAKRAPANI (A. V. Subba Rao) |
| *Nationality* | ... | INDIAN |
| *Address* | ... | 'Chandamama Buildings'<br>2 & 3, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 6. *Name & Address of individuals who own the paper* | } | Chandamama Publications<br>PARTNERS:<br>1. Sri B. Nagi Reddi<br>2. Smt. B. Padmavathi<br>3. Smt. B. Bharathi<br>4. Sri B. N. Suresh Reddi<br>5. Sri B. V. Satish Reddi (Minor)<br>6. Sri B. V. Sanjaya Reddi ( ,, ) |

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*

*1st March* 1975

# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ [ "కర్తవ్యం" ]కు ఆధారం కయిపు ఆదిశేషారెడ్డి కథ. మనిషి అవలంబించవలసిన ధర్మాలు ఆ మనిషి సంఘంలో నిర్వహించే పాత్రను బట్టి వేరు వేరుగా ఉంటాయి. మామూలు గృహస్థు ధర్మాలు అతని భార్యకూ, పిల్లలకూ, బంధుమిత్రులకూ పరిమితమవుతాయి. పెద్ద ఉద్యోగి అయినవాడు తన ఉద్యోగానికి అవసరమైన ధర్మాలు అన్నీ పాటించాలి. రాజు పాటించే ధర్మాలు దేశప్రజలందరికీ సంబంధించి ఉంటాయి.

సంపుటి 56 మార్చి '75 సంచిక 3





# మిత్రభేదం

## 21

పక్షులన్నీ పాలోమని గరుత్మంతుడి వద్దకు వెళ్ళి, లబోమని ఏడుస్తూ, ఉల్లంకిపిట్ట పెట్టిన గుడ్లను సముద్రం అన్యాయంగా హరించిన మాటచెప్పి, న్యాయం కలిగించ వలసిందిగా వేడుకున్నాయి.

"ఉల్లంకిపిట్ట గుడ్లను విడిచిపెట్టి ఎందుకు వెళ్ళిపోవలిసి వచ్చింది?" అని గరుడుడు అడిగాడు.

"మహాప్రభూ, మేం మా పొట్టలు నింపుకునేటందుకు ఎక్కడి కెక్కడికో పోవాలి. ఉల్లంకి పిట్టలు తిండి కోసం వెళ్ళి ఉన్న సమయంలో సముద్రం ఈ దురాగతం చేసింది. ఈ ప్రపంచంలో అన్ని మోసాలకూ, కష్టాలకూ తిండే కారణమని సింహమూ, పాటేలూ కథను బట్టి తెలుస్తూనే ఉన్నది గద?" అన్నది ఆడబాతు.

"ఏమిటా కథ?" అని గరుత్మంతుడు అడిగాడు.

ముసలిబాతు ఆ కథను ఇలా చెప్పింది:

సింహమూ, పాటేలూ కథ

ఒక అరణ్యంలో ఒక పాటేలు మందకు దూరమై, ఒంటరిగా జీవిస్తూ ఉండేది. దట్టంగా పెరిగిన దాని రోమాలూ, భయంకరమైన కొమ్ములూ, దాని అరుపూ చూసి, అది అడవిలో స్వేచ్ఛగా తిరిగేటప్పుడు ఇతర మృగాలు హడలిపోతూ ఉండేవి.

ఒక నాడు ఒక సింహం అనుకోకుండా దాన్ని చూడటం తటస్థించే సరికి, దాని పెద్ద శరీరమూ, రోమాలూ, కొమ్ములూ చూసి బెదిరి, "అమ్మో, ఇది నిశ్శంకగా అరణ్యంలో సంచరిస్తున్నదంటే, నా కన్న ఎన్నోరెట్లు బలం కలదై ఉండాలి," అనుకున్నది.

అట్ట చివరి బొమ్మ

అయితే, ఒక నాడు ఆకలి తీర్చుకోవటానికి ఆ పొటేలు గడ్డి మేస్తూ సింహం కంటపడింది.

"ఓస్, ఇది గడ్డితినే జంతువేనా! ఇది నా అంత బలం గలది కావటానికి వీల్లేదు. ఇది నాకు ఆహారం కాదగినది," అనుకుని, సింహం ఆ పొటేలును చంపి తినేసింది.

ముసలి బాతు ఈ కథ పూర్తి చేస్తూం డగా, విష్ణువు వద్ద నుంచి గరుత్మంతుడికి త్వరగా రమ్మని పిలుపు వచ్చింది. విష్ణువు గరుత్మంతుడి మీద ఎక్కి ఎక్కడికో వెళ్ళాలట.

గరుత్మంతుడు విష్ణువు దగ్గిరికి వెళ్ళి, "స్వామీ, ఇప్పుడు ఎలా రాను? నా జాతికి చెందిన ఈ ఉల్లంకిపిట్ట గుడ్లు సముద్రం అపహరించింది గదా, వాటిని నేను ఉల్లంకి పిట్టకు తిరిగి ఇప్పించటం నా ధర్మం కదా! సముద్రం ఇలాటి దుర్మార్గాలు చేస్తూ ఉంటే, నేను ఏలిన వారికి వాహనాన్ని అన్న ఘనత ఏము న్నదీ?" అన్నాడు.

వెంటనే విష్ణువు తన వింటికి బాణం సంధించి, సముద్రంతో, "ఉల్లంకి పిట్ట గుడ్లను తక్షణం ఇచ్చెయ్యి, లేకపోతే ఈ బాణంతో నిన్ను ఎండగట్టి, ఇసుక పర్రగా చేసేస్తాను," అన్నాడు.



ఈ మాటకు సముద్రం భయంతో కంపించిపోతూ, గుడ్లను తెచ్చి ఉల్లంకి పిట్టల జంటకు సమర్పించుకున్నది.

దమనకం సంజీవకానికి ఈ కథ చెప్పి, "నీకు అలాటి మిత్రులెవ రున్నారు? అందుచేత నువు సింహంతో తలపడే ఆలోచన మాను," అన్నది.

"మిత్రమా, పింగళకం నన్ను చంప దలచినదీ, లేనిదీ నాకు ఎలా తెలు స్తుంది?" అని సంజీవకం దమనకాన్ని అడిగింది.

"అది తేలికగానే తెలుసుకోవచ్చు. సింహం తన సింహాసనమైన రాతి మీద కూర్చుని, నువు దగ్గిరికి వెళ్ళి నప్పుడు,

నవ్వుతూ, ప్రశాంతంగా ఉంటే నీకు ప్రమాదం లేదన్న మాట. కాని, తోక మెలిదిప్పుతూ, పంజాలు బిగబట్టి నువు దూరాన కనిపించగానే నీ కేసి తీక్షణంగా చూస్తూంటే, నిన్ను చంపబోతున్నట్టు ఖాయం చేసుకోవచ్చు," అన్నది దమనకం.

తరవాత దమనకం వెళ్ళి కరటకాన్ని కలుసుకున్నది.

"ఏం చేసుకు వచ్చావు?" అని కరటకం అడిగింది.

"ఇద్దరిమధ్యా చిచ్చుపెట్టి వచ్చాను," అన్నది దమనకం.

"నిజంగానా?" అన్నది కరటకం.

"నా ప్రయత్నాలు ఎలా ఫలించేదీ నువు త్వరలోనే చూస్తావు. ఎద్దుకూ, సింహానికీ మధ్య ఉండే స్నేహబంధాన్ని తెంచి పారేశాను," అన్నది దమనకం.

"అందులో ఆశ్చర్యమేమున్నదీ? అదే పనిగా నీరు ప్రవహిస్తూంటే రాళ్ళు కూడా అరిగిపోతాయి. నువు విడవకుండా కుట్ర చేస్తే వాళ్ళ స్నేహం చెడిపోవచ్చు. కాని ఇంత పెద్ద పన్నాగం పన్ని, ఇందువల్ల నీ కేం ఒరుగుతుందనుకుంటున్నావు?" అని కరటకం అడిగింది.

"అదేం ప్రశ్న! నేను ప్రధాన మంత్రినై, ఎంతో లాభం పొందబోతున్నాను. గ్రంథాలు పడచదివి కూడా, ఆ చదువువల్ల డబ్బూ, అధికారమూ సంపాదించుకో లేనివాడి చదువు వ్యర్థమని పెద్దలు చెబుతారు," అన్నది దమనకం.

"కాని, స్వార్థం కూడా హీనమైనదే గద! ఈ తుచ్ఛమైన శరీరం కోసం ఏది బడితే అది చెయ్యరాదు. అదీగాక, నీ మోసం బయటపడి, వంచకుడి కథలో లాగ, నీ ప్రాణానికే అపాయం కలగ వచ్చు," అన్నది కరటకం.

"ఏమిటా కథ?" అని దమనకం అడిగింది.

కరటకం వంచకుడి కథ ఇలా చెప్ప నారంభించింది:





# విచిత్ర కవలలు

## 9

[సంధ్యా, నిశీధులు చెప్పిన మాట నమ్మి, రాక్షసుడు గడ్డపువాణ్ణి చూడబోయాడు. ఈ లోపల కవలలిద్దరూ, రాకసుడి భవనంలో వున్న కొలను పద్దకుపోయి, శిలాప్రతిమగానూ, కోతిగానూ మారిపోయారు. ఉదయనుడి వెంట వచ్చిన ఒక కన్య, రాక్షసుడి కేక విని, కవలల్ని కొలనులోకి తోసింది. అందరూ హంసలుగా మారిపోయారు. తరవాత—]

రాకసుడు మరొకసారి, "ఎక్కడరా మీరూ ?" అంటూ భయంకరంగా కేక పెట్టాడు. వాడిప్పుడు చాలా కోపం మీద వున్నాడు. సంధ్యా, నిశీధులు తనను మోసపుచ్చారని వాడు, గడ్డపువాడితో మాట్లాడిన తరవాత తెలుసుకున్నాడు.

గడ్డపువాడు, రాకసుడు తన ఇంటికి రావటం చూస్తూనే ఆశ్చర్యపోయాడు. తరవాత వాడికి రాకసుడు సంగతి సందర్భాలు చెప్పగానే తల బాదుకుంటూ, "అయ్యో, ఆ దొంగ వెధవల్ని కోటలోనే వదిలి వచ్చావా ? వాళ్ళు నా దగ్గిరున్న భస్మాలూ అవీ కాజేసి పోవటమేగాక, పైగా నీకు కూడా భలే టోపీ వేశారే ! వీళ్ళెక్కడో గడుగ్గాయిల్లా వున్నారు చూడబోతే. ఇప్పటికైనా మించిపోయింది లేదు. నువ్వు వెంటనే తిరిగి కోటకు పోయి వాళ్ళను పట్టుకో. అలా కాకపోతే, మన



రహస్యాలన్నీ వాళ్ళకు తెలిసిపోతాయి. ముఖ్యంగా మన భవనం యొక్క రహస్యం వాళ్ళకు తెలిసిందా, నీకూ, నాకూ కూడా ఆయువు మూడిందన్న మాటే. కనుక వెళ్ళు, త్వరగా వెళ్ళు.'' అని గడ్డపువాడు, రాక్షసుణ్ణి తొందర పెట్టాడు.

గడ్డపువాడి సలహా ప్రకారం రాక్షసుడు తన కోటలోని భవనానికి తిరిగి వచ్చే సరికి, తను ద్వారం వద్ద కాపలా వుంచి వెళ్ళిన సంధ్యా, నిశీధులు కనిపించలేదు. దానితో వాడు, ''ఎక్కడరా మీరూ!'' అని పెడబొబ్బలు పెట్టుకుంటూ కొలను వైపుకి వచ్చాడు.

ఎంత వెతికినా రాక్షసుడికి కొలను దగ్గిరా వాళ్ళ జాడ కనిపించలేదు.

రాక్షసుడు మరింత కోపంగా ఆ ప్రాంతాలను చీమతలకాయంత మేర కూడా విడవకుండా గాలించసాగాడు. సాయంత్రం వరకూ అలా వెతికినా ప్రయోజనం లేకపోయే సరికి, వాడికి ప్రాణం విసిగి పోయింది. చివరకు నిరాశతో తన భవనం చేరుకున్నాడు.

రాక్షసుడు యిలా వెతుకుతున్నంత సేపూ, ఉదయనుడు తన సోదరులతో సహా హంస రూపంలో కొలనులోనే వున్నాడు. ఎప్పుడైతే రాక్షసుడు తిరిగి భవనానికి వెళ్ళి పోయాడో, అప్పుడు ఉదయనుడు నీటిలోంచి బైటికి వచ్చి మామూలు రూపం పొందాడు. అతని వెంటనే సరోవరకన్య కూడా బైటికి వచ్చి చేరుకున్నది. అప్పుడు ఆ కన్య ఉదయనుడితో యిలా చెప్పింది:

''మీరెవరో పాపం దురదృష్టవంతులు. దారి తప్పి యీ భవనంలో ప్రవేశించినట్టున్నారు. ఈ భవనానికి చుట్టుపక్కల నాలుగు కోసుల మేర ఎక్కడ ఏ పురుగు కదిలినా, యిట్టే పసికట్టి, పట్టివేయగల గడ్డపువాడు ఒకడున్నాడు. వాడిని తప్పించుకు రావటం బ్రహ్మతరం కూడా కాదు. మరి మీరెలా వచ్చారో నాకు ఆశ్చర్యం

గానే వున్నది. ఇప్పటికైనా మీరు యీ చోటు వదిలి వెళ్ళిపోవటం మంచిది. అలా చేయకపోతే మీ ప్రాణాలకే మోసం కలగటం నిజం. ఈ భవనం ఒక దుష్ట రాక్షసుడిది. ఇప్పుడు వాడిక్కడ లేడు. వాడు ఎప్పుడు వచ్చేదీ, ఎప్పుడు పోయేదీ ఎవరికీ తెలియదు. ఈ లోపల మీ సోదరులకు మామూలు రూపాలు వచ్చే మార్గం నేను చెబుతాను. అలా చేసి, త్వరగా తప్పించుకు వెళ్ళిపొండి.''

అంతా విని ఉదయనుడు, ''మేము పొరబాటున యిక్కడికి రాలేదు. ఈ భవనం యొక్క రహస్యమేమిటో తెలుసుకోవాలనే కుతూహలంతోనే, ప్రాణాలను కూడా లెక్క పెట్టక వచ్చాము. కనుక మమ్మల్ని గురించి నువు విచారించకు. ఈ రాక్షసుణ్ణి గురించి నీకు కూడా తెలిసిన వివరాలు చెబితే చాలు. ఇంతకూ నీవు ఎవరివో చెప్పావే కాదు. చెప్పటానికి అభ్యంతరం లేకుంటే, ఆ విషయం విని సంతోషిస్తాను.'' అన్నాడు.

ఇందుకు సరోవరకన్య, ''చెప్పటానికి అభ్యంతరం ఏమీ లేదు. కాని, తెలుసుకుని నీవు చేయగలిగింది ఏమీ వుండదనుకుంటాను. అయినా అడిగావు గనక చెబుతాను,'' అంటూ కొలనులోకి




వెళ్ళి, మరి కొద్దిసేపటిలో, మరి రెండు హంసలతో బైటికి వచ్చింది. సరోవరకన్యతోబాటు ఆ రెండు హంసలు కూడా ఒడ్డుకి రాగానే, రెండు కన్యలుగా మారాయి.

వాళ్ళు ముగ్గురూ ఒక్క అచ్చులో పోసినట్టు వుండటం చూచి ఉదయనుడు, ''మీరు కవలల్లా కనిపిస్తున్నారే?'' అన్నాడు.

''అవును,'' అని ముగ్గురు కన్యలూ ఒకేసారి జవాబిచ్చారు. దానితో ఉదయనుడు ఉత్సాహభరితుడై, ''అయితే యిన్నాళ్ళ బట్టీ మేము వెతుకుతున్నది మీ కోసమే. మీరు దానశీల మహారాజు గారి కుమార్తెలు కదూ?'' అని అడిగాడు.




ఈ ప్రశ్నకు ఆ కన్యలు పొందిన ఆశ్చర్యం యింతా అంతా కాదు. ''నిజమే. మా సంగతి నీ కెలా తెలిసింది?'' అని విస్తుపోతూ అడిగారు.

''ఎలా తెలిసేదేమిటి? మీ పుట్టు పూర్వోత్తరాలన్నీ మాకు తెలుసు. మిమ్మల్ని వెతికి పట్టటానికే, మేము మీ తండ్రిగారి ఆశీర్వాదం పొంది బయలు దేరాం. మీ పేర్లు...'' అని అడిగాడు ఉదయనుడు.

''సుహాసిని....మా పుట్టు పూర్వోత్తరాలన్నీ తెలుసునన్నారుగా? అటువంటప్పుడు తక్కిన రెండు పేర్లూ, మీరే చెప్పుకో గలరనుకుంటాను,'' అన్నది ఆ కన్య.

''చెప్పుకోలేకేం? ఇంత సులభంగా, ఇంత త్వరలో మిమ్మల్ని కలుసుకో గలుగుతామని మేము కలలో కూడా అనుకోలేదు. ఈ శుభవార్త నా సోదరులకు కూడా తెలిస్తే ఎంత బాగుండునో." అని తన సోదరులు మానవ స్వరూపంతో లేనందుకు విచారం కనబరిచాడు, ఉదయనుడు.

ఇది చూసి సుహాసిని, ''విచారించకు!'' అంటూ కొలనులోకి దిగి మరి కొద్దిసేపటికల్లా కోతి రూపంతో వున్న నిశీధుడితోనూ, శిలా ప్రతిమ రూపంతో వున్న సంధ్యతోనూ ఎంతో ఉత్సాహంగా బయిటికి వచ్చింది.

తర్వాత ఆమె ఉదయనుడిని వెంట బెట్టుకుని, ఆ తోటలోని మామిడిచెట్టు దగ్గిరకు తీసుకు వెళ్ళింది.

ఆ మామిడిచెట్టు పక్కనే కొన్ని కుక్క గొడుగులు మొలిచి వున్నై. వాటిలో కొన్నిటిని తీసుకోమన్నది. ఉదయనుడు అలాగే చేశాడు. తర్వాత మరి కొంత దూరం తీసుకుపోయింది. అక్కడ ఒక రాకెస విగ్రహం వున్నది. ఆ విగ్రహం నోటిలోంచి నీరు ప్రవహిస్తోంది. ఆ నీరు కొంత తీసుకోమన్నది. అలాగే ఒక ఆకుతో దొన్నె చేసి యివ్వగా, ఉదయనుడు దాంట్లో ఆ నీరు నింపుకొన్నాడు. వీటితో

సహా వాళ్ళు తిరిగి కొలను వద్దకు చేరుకొన్నారు.

సుహాసిని, ఉదయనుడితో ఆ కుక్క గొడుగులను కోతికి పెట్టమన్నది. అలాగే చేసేసరికి కోతి రూపం పోయి, నిశీధుడికి తిరిగి మామూలు రూపం వచ్చింది. తర్వాత దొన్నెతో తెచ్చిన నీరు శిలా ప్రతిమకు రాచేసరికి, సంధ్యకు మామూలు రూపం వచ్చేసింది.

అప్పుడు ఉదయనుడు ఆ కన్యలను తన సోదరులకు చూపుతూ, "చూచారా, చిత్రం! మనం ఎవరి కోసం వెదుకుతున్నామో, ఆ రాజకుమార్తెలే వీరు. కనుక మనం వచ్చిన పని అయినట్టే. ఇక వీరిని తీసుకుని మనం యీ భవనం నుంచి బైటపడే మార్గం చూడాలి." అన్నాడు.

అందుకు సుహాసిని, "అది అంత తేలికైన పనిగాదు. మమ్మల్ని రక్షించటం మాట అలావుంచి, ముందు మీ ప్రాణాలు కాపాడుకోవటానికి యిక్కడి నుంచి బైట పడగలిగితే......" అని యింకా ఏమో చెప్పబోతూండగా, ఒక పెద్ద సుడిగాలి ప్రారంభమైంది.

అప్పుడు సుహాసిని, "అడుగో, వాడు వస్తున్నాడు. ఈ సుడిగాలి దానికే గుర్తు. ఇక మేము తిరిగి కొలనులోకి పోతాం. మరి మీగతి ఏమిటి? క్రిందటి సారిలాగా హంసలుగా మార్చినా, వాడు మిమ్మల్ని పట్టివేయగలడు. మరి ఎలా తప్పించు





కుంటారో జాగ్రత్త,'' అని చెబుతూ తన చెల్లెళ్ళతో సహా కొలనులోకి పోయింది.

వెంటనే ఉదయనుడు తన వద్ద వున్న తెల్ల భస్మం తన పైనా, సోదరల పైనా చల్లాడు. వెంటనే వాళ్ళు మాయమై పోయారు. మరి కొద్ది సేపటికల్లా సుడి గాలి తగ్గిపోయింది. ఆ వెంటనే ఒక బ్రహ్మండమైన గద్ద కొలను ఒడ్డున వచ్చి వాలింది. కాని, చిత్రం! ఒడ్డున వాలుతూనే దానికి గద్దరూపం పోయి, ఒక భయంకరమైన రాక్షసాకారంతో నిలబడింది.

ఆ రాక్షసుడు అలా నిలబడగానే కొలనులోవున్న హంసలన్నీ, రెక్కలు రెప రెప కొట్టుకుంటూ వచ్చి, బారులు తీర్చి ఒడ్డు దగ్గరగా నీటిలో నిలిచినై. రాక్షసుడు ఒక్క క్షణం సేపు వాటివంక పరీక్షగా చూచి, ఆ వెంటనే తిరిగి గద్ద రూపంలో రివ్వున ఆకాశమార్గాన వెళ్ళిపోయాడు.

ఇదంతా జరిగేటప్పటికి బాగా చీకటి పడింది. ఉదయనుడు తన భస్మం సహాయం వల్ల తనకూ, సోదరులకూ మామూలు స్వరూపాలు తెప్పించుకున్నాడు. అప్పటికి మూడు రోజులైంది, వాళ్ళు తిండితిని. అందువల్ల ముందుగా తమ దగ్గిరవున్న తువ్వాలు సహాయంతో పళ్ళూఫలాలూ సృష్టించుకుని పొట్టలు నింపుకొన్నారు. తర్వాత కవలకన్యలు తిరిగి బైటికి వస్తారేమోనని కొంతసేపు ఎదురు చూచారు. కాని ఎంతసేపటికీ వాళ్ళు రాకపోయేసరికి, యిక ఆ రాత్రికి ఎలాగో అక్కడే గడపవలసి వుంటుందని నిశ్చయించుకున్నారు. మామూలు రూపంతో వుండటం క్షేమంకాదని వాళ్ళు భస్మం మహిమవల్ల, తిరిగి అదృశ్య రూపం పొంది అక్కడే వుండిపోయారు.

తెల్లవారింది. కొలనులోంచి కవల కన్యలు బైటికి రావటమూ, కవలసోదరులు తిరిగి మామూలు స్వరూపం పొందటమూ ఒక్కసారిగా జరిగింది.

అప్పుడు ఉదయనుడు, సుహాసినిని అడిగాడు: "అయితే, యీ రాక్షసుడు తిరిగి ఎక్కడికి వెళ్ళాడు? మళ్ళీ ఎప్పుడు వస్తాడు?"

"ఎక్కడికేముంది. వేటకు వెళ్ళి వుంటాడు. వేట అంటే జంతువుల వేట కాదు, కవలలవేట." అని బదులు చెప్పింది సుహాసిని.

"కవలల వేట ఏమిటి?" అని మళ్ళీ ప్రశ్నించాడు ఉదయనుడు.

"అదొక చిత్రమైన రహస్యం. ఈ రాక్షసుడు ఒక దేవిని ఆరాధిస్తున్నాడు. ఆ దేవి యొక్క మహిమవల్లనే ఈ మాయా భవనం నిర్మించగలిగాడు. ఇందుకుగాను వాడు దేవికి యాభైమంది కవలల్ని బలి యివ్వాలి. ఈ బలి పూర్తి అయిందంటే, దేవి వాడికి అన్ని మహిమలూ ప్రసాదించటమే గాక, మరణం అనేది లేకుండా కూడా వరం యిస్తుంది. ఇప్పటికి నలభై ఏడుగురు కవలలు మాత్రమే వాడికి చిక్కారు. తక్కినవారు ఎప్పుడు చిక్కుతారా, ఎప్పుడు బలి అర్పించి దేవియొక్క వరం పొందుతానా, అని వాడు ఒక్క క్షణం కూడా స్తిమితం లేక, యిలా నిత్యమూ గద్దరూపంలో ప్రపంచం అంతా చుట్టి వస్తుంటాడు." అని రాక్షసుడిని గురించిన గుట్టు కాస్తా వెల్లడించింది, సుహాసిని.



ఇదంతా కవల సోదరులు ఎంతో శ్రద్ధగా చెవులు రిక్కించివిన్నారు. అంతా విని, "ఆహా! ఎంత అదృష్టవంతులం. మేము ముగ్గురం వాడికి చిక్కవున్నట్టయితే, ఈ రోజుతో వేటా పూర్తి ఆయేది, బలీ సంపూర్ణమయేది సుమా!" అన్నాడు ఉదయనుడు.

"అదెలాగ? బలి ఎలా పూర్తవుతుంది? మీరూ కవలలేనా?" అని ఆశ్చర్యంతో అడిగారు కవలకన్యలు.

"అవును. వాడికి కావలసిన మనుష్యులమూ, మిమ్మల్ని రక్షించవలసిన వాళ్ళమూ మేమే అయామే అని విచారిస్తున్నాను." అన్నాడు ఉదయనుడు.

"అలాగైతే మీరు మరీ జాగ్రత్తగా మసలుకోవలసి వుంటుంది," అని హెచ్చరించింది, సుహాసిని.

"అవును. అసలు రహస్యం యిప్పుడు తెలిసింది కనుక, యిక ముందు వుండవలసిన జాగ్రత్తలోనే వుంటాం. కాని ఎలాగైనా యిక్కడినుంచి బైటపడేమార్గం ఆలోచించాలి కదా? ఈ చోటు అంతా మాయాజాలంతో నిండి వున్నట్టు తెలుస్తోనే వుంది. అందువల్ల యిక్కడినుంచి బైటపడటంలో మనం ఎదుర్కోవలసిన కష్టాలు ఏముంటయ్యో తెలియజేస్తే, వాటికి తగిన ఉపాయం ఆలోచిస్తాము," అన్నాడు ఉదయనుడు.

అందుకు సుహాసిని, "అన్నింటికన్నా ముఖ్యమైన విషయం ఒక్కటే వున్నది. అది ఏమిటీ అంటే, మీరు ఆ రాక్షసుడి కంట బడకుండా వాడి భూగృహంలో ప్రవేశించ గలిగితే సరి," అన్నది.

ఇది విన్న ఉదయనుడు, "ఓస్, ఇదొక ఘనకార్యమా. మా దగ్గర వున్న భస్మాలవల్ల, మేము ఎలా అదృశ్య రూపం పొందగలుగుతున్నదీ, మీరే చూస్తారు గదా?" అన్నాడు.

అందుకు సుహాసిని, "మహా గొప్ప ఉపాయం కనిపెట్టావే! ఇంకా నయం, ముందుగా చెప్పావు గనుక తెలుసుకోగలిగాను. నీ భస్మాలూ, అంజనాలూ, వాడి భూగృహంలో పని చెయ్యవు. వాటి మహిమ అల్లా యిక్కడ వున్నంత వరకే. కనుక వాటి ఆశ పెట్టుకోబోకు," అన్నది.

ఎప్పుడైతే యీ విషయం విన్నారో అప్పుడు కవలలకు అది వరకున్న ధైర్యం కాస్తా జారిపోయి తెల్లమొగం వేశారు. వాళ్ళ విచారం కనిపెట్టిన సుహాసిని, "అలా అధైర్యపడతారేం! ఏదైనా ఉపాయం ఆలోచించాలి," అన్నది.

"ఆలోచించేందుకైనా వ్యవధి ఉండాలి కదా!" అన్నాడు ఉదయనుడు.

అందుకు సుహాసిని, "నిజమే. నిదానంగానే ఆలోచించాలి," అన్నది.

—(ఇంకా వుంది)






# కర్తవ్యం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు చేస్తున్న పని ఎంత హీనమైనదైనా, విజయుడి లాగా నువు కూడా లోక కల్యాణాన్ని కోరుతూ ఉండవచ్చు. శ్రమ తెలికుండా ఉండగలందులకు నీకు విజయుడి కథ చెబుతాను విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

విజయుడు మాళవరాజైన మార్తాండ వర్మకు ఒకడే కొడుకు. అతను ఉపనయనం కాగానే విద్యాభ్యాసం కొరకు దేశం దాటి ఒక గొప్ప గురుకులానికి వెళ్ళి, అక్కడ యుద్ధవిద్యలూ, రాజనీతి, ధర్మశాస్త్రాలూ మొదలైనవి అభ్యసించుతూ యుక్తవయస్కుడయ్యాడు.

## బేతాళ కథలు



ఒకనాడు గురుకులానికి అధిపతి అయిన మహర్షి విజయుణ్ణి పిలిచి, ''నాయనా, నీ విద్యలు పూర్తి అయాయి. నీకు యువరాజుగా అభిషేకం పొందే వయసు వచ్చింది. ఇక నువు నీ దేశానికి తిరిగి వెళ్ళి, ప్రజారంజకంగా పరిపాలిస్తూ, దీర్ఘాయుష్మంతుడివి కావాలని ఆశీర్వదిస్తున్నాను.'' అన్నాడు.

విజయుడు గురువు వద్ద సెలవు పుచ్చుకుని, తన గుర్రం మీద ఒంటరిగా తన దేశానికి బయలుదేరాడు. అతను తమ దేశపు సరిహద్దులో అడుగుపెట్టి ముందుకు వెళ్ళిన కొద్దీ ఒక విషయం స్పష్టమయింది. తన తండ్రి దేశాన్ని చాలా ఘోరంగా పరిపాలిస్తున్నాడు. ప్రజలు ఆ పరిపాలనలో అష్టకష్టాలూ పడటమే గాక, రాజును దుమ్మెత్తి పోస్తూ, తిరుగుబాటు ధోరణిలో ఉన్నట్టు కనబడ్డారు. కుగ్రామాలలోని గ్రామాధికార్లు కూడా ప్రజల ఆగ్రహానికి భయపడి వారి అరాజక ధోరణులను అదుపులో ఉంచటానికి సాహసించలేక పోతున్నారు. విజయుడు చూసిన ప్రతి చిన్నగ్రామం లోనూ, పెద్ద గ్రామంలోనూ ఇదేపరిస్థితి. ఎక్కడ చూసినా దొంగతనాలూ, దోపిడీలూ, దారిద్ర్యమూ, పన్నులబాధా, అధికార్ల భయమూ తాండవిస్తున్నాయి. చివరకు విజయుడు తాను యువరాజునని చెప్పుకునేటందుకు కూడా ఎవరూ కనిపించలేదు. రాజుకొడుకును ఆదరించే సద్బుద్ధి ఎవరిలోనూ ఉన్నట్టు అతనికి తోచలేదు. అందుచేత అతను వెళ్లిన చోటనల్లా తన పేరు వినయుడనీ, తాను మాళవ ఆస్థానంలో ఉద్యోగం కోసం పోతున్నాననీ అడిగిన వాళ్ళకు చెప్పుకో సాగాడు.

ఒక వృద్ధుడు విజయుడితో, ''బాబూ, మాళవ ఆస్థానానికి కాలం తీరిపోయింది. నీలాటి యువకులంతా చంపారణ్యంలో సుధీరుడి కింద సైనికులుగా చేరి శిక్షణ పొందుతున్నారు. ఇవాళ కాకపోతే రేపైనా

సుధీరుడే మాళవదేశానికి రాజు. అతను మార్తాండవర్మ మీద దాడి చెయ్యటానికి మంచి తరుణం కోసం ఎదురు చూస్తున్నాడు. అతని మనుషులు కోటలో కూడా ఉన్నారంటే నమ్ము. వాళ్ళు పిలుపు ఇచ్చిన మరుక్షణం కోట నేలమట్టమవుతుంది. దానితోబాటే ప్రజల కష్టాలు ఈడేరిపోతాయి." అన్నాడు.

పరిస్థితి అంతదాకా వచ్చిందని విని విజయుడు నిర్ఘాంతపోయాడు. అతను చంపారణ్యానికి దారి తెలుసుకుని అక్కడికి వెళ్ళాడు. ఆ అరణ్యంలో కొండలమధ్య ఒక మహానగరం ఉన్నది. అక్కడ దాదాపు లక్షమంది యువకులున్నారు. వారు కొండజాతుల వాళ్ళ మధ్య సఖ్యంగా తిరుగుతూ, వారికి రాజద్రోహం నూరిపోస్తున్నారు. సుధీరుడు అనేవాణ్ణి వాళ్ళు తమ రాజుగానే గాక, దేవుడుగానే భావిస్తున్నారు. ఆ ప్రాంతాన్ని కొండజాతి వీరులు చాలా సమర్థతతో రక్షిస్తున్నట్టు విజయుడికి తెలిసింది. రాజు పంపిన వేగులవాళ్ళలో ఒక్కడు కూడా రాజు వద్దకు తిరిగి పోలేదు. కొందరు చచ్చారు. మరికొందరు సుధీరుడి బలగంలో చేరిపోయారు.

మార్తాండవర్మ ఒక సైనిక దళాన్ని కూడా ఆ ప్రాంతానికి పంపాడు. ఆ సైనికులు ఒక కొండకనుమ దాటుతూ ఉండగా పైనుంచి రాళ్ళుపడి అందరూ మరణించారు.



విజయుడు చంపారణ్యంలోకి ప్రవేశించగానే నలుగురు ఆటవికులు అతని చుట్టూ మూగి, అతని పేరూ, ఊరూ, అతని పనీ అడిగారు.

"నాపేరు వినయుడు. నేను యోధుణ్ణి, యుద్ధ విద్యలన్నీ నాకు తెలుసు. నేను సుధీరుడి సైన్యంలో చేరటానికి వచ్చాను," అన్నాడు విజయుడు.

ఆటవికులు అతన్ని ఒక పెద్ద గుహలోకి తీసుకుపోయారు. అక్కడ సుధీరుడు ఏదో మాట్లాడుతున్నాడు. అతని ముందు



చాలా మంది యువకులు కూర్చుని, శ్రద్ధగా అతను చెప్పేది వింటున్నారు. విజయుడు కూడా ఆ యువకుల సరసనే కూర్చుని సుధీరుడు చెప్పేది వినసాగాడు:

"రాజు అనగా ఎవడు? బలంకల వాడు రాజు అవుతాడు. తన పరిపాలనతో ప్రజలకు క్షేమమూ, సౌఖ్యమూ కలిగించినవాడు తన రాజరికాన్ని నిలుపుకుంటాడు. మార్తాండవర్మకు బలమూ లేదు, వివేకమూ లేదు. అతని తండ్రీ, తాతా రాజులు గనక అతను రాజు ననుకుంటున్నాడు. అతని తాత రాజుగాపుట్టలేదు. ఆయన సాధారణ దళాధిపతి. అసమర్థుడైన తన రాజును చంపి తానే రాజయినాడు. మార్తాండవర్మ తండ్రి వివేకంగా ప్రజలను పాలించి తన రాజరికం నిలబెట్టుకున్నాడు. రాజుగా ఉండటానికి ఏ విధంగానూ అర్హుడు కాని మార్తాండవర్మను మనం చంపుతాం. అతని చావుకు పండగ చేసుకునే ప్రజలు తమకు కావలసిన రాజును తామే నిర్ణయిస్తారు."

ఇలా సుధీరుడు చాలాసేపు చెప్పుకుపోయాడు. అతని నోటవచ్చే ప్రతిమాటా విజయుడి మనస్సులో గాఢంగా నాటుకున్నది. అతని ప్రసంగం అయిపోయినాక, ఆటవికులు విజయుణ్ణి సుధీరుడి వద్దకు తీసుకుపోయారు. విజయుడు అతనితో తన పేరు వినయుడనీ, తాను ఫలానా గురుకులంలో యుద్ధ విద్యలు నేర్చుకున్నాననీ, ఉద్యోగం కోసం మాళవ దేశానికి వస్తూ, సుధీరుణ్ణి గురించి విని అతని కింద సైనికుడుగా చేరటానికి వచ్చాననీ చెప్పాడు.

సుధీరుడు విజయుడి యుద్ధవిద్యలు పరీక్షించి ఆశ్చర్యపోతూ, "మా సైనికులలో వెన్ను చూపకుండా ప్రాణాలు ఒడ్డి పోరేవారు వేలకొద్దీ ఉన్నారుగాని, నీలాటి యోధులు బహుకొద్ది. యుద్ధం జరిగినప్పుడు నీకు గొప్ప బాధ్యత ఉంటుంది," అన్నాడు.

విజయుడు ఎంతో సంతోషం కనబరిచాడు.

త్వరలోనే కోటనుంచి సుధీరుడికి సంకేతం అందింది. అతను తన సైనికులను దళాలుగా విభజించి, దళనాయకులను ఏర్పాటుచేసి, కోట మీదకి దండెత్తిపోయాడు. విజయుడు ఒక పెద్ద దళానికి నాయకుడు.



తిరుగుబాటు సేనలు కోట ముందు విడిశాయి. తరవాత కొద్ది సేపట్లోనే కోట గోడల మీద రాజుగారి సైనికులు ప్రత్యక్షమయారు. ఉభయ పక్షాలూ యుద్ధానికి సిద్ధంగా ఉన్నాయి.

చీకటిపడింది. అర్ధ రాత్రివేళ విజయుడు లేచి శిబిరంలో తిరగసాగాడు. అతను గస్తీ తిరుగుతున్నట్టు తిరుగుతూ కోటద్వారం వద్దకు చేరి, చిన్న తలుపు మీద తట్టాడు.

''ఎవరు వారు?'' అని లోపలి నుంచి ఎవరో అడిగారు.

''యువరాజును. విజయవర్మను.'' అన్నాడు విజయుడు.

తలుపు తెరుచుకున్నది. అవతల కత్తి దూసి ఎత్తి పట్టుకుని ఉన్న సైనికుడు కనిపించాడు.

''కత్తి దించు. తలుపు మూయ్యి. నేను గురుకులం నుంచి ఈ శత్రువుల మధ్యగా రావటం చాలా శ్రమ అయింది. నేను సరాసరి రాజభవనానికి పోతున్నాను. నా వెంట ఒక సైనికుణ్ణి పంపు.'' అన్నాడు విజయుడు.

వాకిలి వద్ద మరొక సైనికుణ్ణి ఉంచి, తలుపు తెరిచినవాడే విజయుడి వెంట రాజభవనం దాకా వచ్చాడు. రాజభవనం పహరాపెద్ద విజయుణ్ణి గుర్తించి, అతని కాళ్ళకు నమస్కారం చేసి, ''ఎప్పుడు వచ్చారు, ప్రభూ?'' అన్న మీదట ఆ సైనికుడు తృప్తిపడి వెనక్కు వెళ్ళిపోయాడు.

తన కొడుకు వచ్చాడన్న వార్త వినగానే మార్తాండవర్మ లేచాడు.



"మనం ఏకాంతంగా మాట్లాడుకోవాలి," అన్నాడు విజయుడు, తండ్రి వేసే ప్రశ్నలకు జవాబు చెప్పకుండా.

ఇద్దరూ ఒక గదిలో కూర్చున్న తరవాత మార్తాండవర్మ, "రేపటి దాకా ఆగని ముఖ్యవిషయం ఏమిటి?" అన్నాడు కొడుకుతో.

"మీరు రాజ్యం విడిచి పారిపోవాలి. ప్రజలు మీ పరిపాలనను మనస్ఫూర్తిగా ద్వేషిస్తున్నారు," అన్నాడు విజయుడు.

మార్తాండవర్మ మండిపడి, "నే నింకా బతికి ఉండగానే రాజు కావాలని చూస్తున్నావా? ప్రజలు నిన్నే రాజుగా కోరుకుంటున్నారా?" అని అడిగాడు.

"అవును!" అంటూ విజయుడు కత్తి దూసి తండ్రి తల నరికేశాడు.

కొద్ది క్షణాలలో ఈ హత్య గురించి అంతఃపురంలో తెలిసింది. తరవాత కోట అంతా తెలిసింది. మంత్రులూ, సేనాపతులూ హడావుడిగా వచ్చి, విజయుడితో చర్చలు జరిపారు. ఎవరూ విజయుణ్ణి నిందించ లేదు. కొద్ది మంది మెచ్చుకున్నారు. తెల్లవారినదాకా ఆలోచనలు జరిగాయి. తెల్లవారగానే విజయుడికి రాజ్యాభిషేకం జరిగిపోయింది.

"కోట బయట విడిసి ఉన్న సేనలతో సంధి ప్రకటించండి. వారికి నాయకుడైన సుధీరుణ్ణి ఆహ్వానించండి," అని విజయుడు తన మంత్రులకు చెప్పాడు.

అంతా విజయుడి అంచనా ప్రకారమే జరిగిపోయింది. సుధీరుడు కోటకు వచ్చి, విజయుడే రాజనీ, అతను తన చేతిమీదుగానే ప్రజాకంటకుణ్ణి చంపాడనీ తెలిసి చాలా సంతోషించాడు.

"నీలాటి ప్రజాభిమాని రాజుగా ఉండటం ఈ దేశప్రజలు చేసుకున్న పుణ్యం. నీ పరిపాలన ప్రజారంజకంగా ఉంటుందని ఆశిస్తున్నాను." అన్నాడు సుధీరుడు విజయుడితో.

"అందుకు నీ సహాయంకావాలి. నువు నాకు సర్వసేనానిగా ఉండి, పరిపాలనలో

సలహాలు ఇస్తూ ఉండాలి," అన్నాడు విజయుడు. అందుకు సుధీరుడు సంతోషంగా ఒప్పుకున్నాడు.

విజయుడు గురుకులంలో చదువుకున్నది వృథా పోలేదు. అతను న్యాయమూ, ధర్మమూ తప్పకుండా, ప్రజారంజకంగా చాలాకాలంపాలించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, విజయుడి ప్రవర్తనకు మూలకారణం ఏమిటి? గురువుగారి ఆశీర్వచనమా, సుధీరుడి ప్రసంగాలా, ప్రజలపట్ల అభిమానమా, తండ్రి మీద ద్వేషమా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజులు నిరంకుశులు. వారిని బోధలు మార్చవు. ప్రజారంజకంగా పాలించాలని అందరు రాజులకూ తెలుసు. కాని అలా పాలించకపోతే వారిని శిక్షించే మార్గం లేదు. అందుకే రాజులు నిరంకుశంగా పాలించటానికి ప్రయత్నిస్తారు. కాని విజయుడు సుధీరుణ్ణి కలుసుకున్నాక ఒక విషయం తెలుసుకున్నాడు: సరి అయిన నాయకత్వం ఉంటే నిరంకుశుడైన రాజును ప్రజలు శిక్షించగలరు. సుధీరుడి ప్రసంగాలు విజయుణ్ణి నిరంకుశుడు కాకుండా నిగ్రహించినమాట నిజం. ఇక అతను తండ్రిని ఎందుకు చంపాడంటే, యుద్ధం జరిగితే ఎలాగూ ఆ తండ్రి చావక తప్పదని అతను గ్రహించాడు. అందుకే తండ్రిని రాజ్యం వదలమన్నాడు. కాని తండ్రి వినలేదు. యుద్ధంలో తండ్రి చస్తే నిశ్చయంగా సుధీరుడు రాజవుతాడు. అందుచేత యుద్ధం జరగకుండా విజయుడు తాను రాజై కూర్చుని, సుధీరుణ్ణి సేనాపతిగా నియమించి తన స్వార్థం చూసుకున్నాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.

—(కల్పితం)



# 159. సరికొత్త అగ్నిపర్వతం

ప్రపంచం అంతటా అగ్నిపర్వతాలు అనేక కోట్ల ఏళ్లుగా ఉంటున్నాయి. కాని చారిత్రక యుగంలో కొత్తగా పుట్టినవి ఆరుమాత్రమే. వాటిలోకెల్లా అధునికమైనది "పరికుటిన్" అగ్నిపర్వతం. ఇది 1943 ఫిబ్రవరి 20 నాడు మెక్సికోదేశం లోని ఒక మొక్కజొన్న చేనులో పుట్టింది. ఆ చేనులో అనాదిగా ఒక గుంట ఉండేది. అందులో నుంచి భూగర్భ ధ్వనులు వినిపిస్తూండేవి. దాని సమీపంలో వెచ్చగా ఉండేది. ఫిబ్రవరి 20న ఆ గుంట నుంచి భూమిలో ఒక దీర్ఘమైన నెర్రె ఏర్పడింది. అందులో నుంచి ధూళీ, ఈలలాటి ధ్వనీ రావటం మొదలు పెట్టింది. జనం పోగయారు. శాస్త్రజ్ఞులు చేరారు. త్వరలోనే చేనులో ఒక బిలం ఏర్పడి, దాని నుంచి మొదట ఎర్రగా కాలిన రాళ్ళూ, తరవాత శిలాద్రవమూ బయటికి రాసాగాయి. భూకంపాలూ, ఉరుములూ, మెరుపులూ కనిపించాయి. ఆ రాత్రి 10 గంటల కల్లా 30 అడుగుల ఎత్తు "గోపురం" ఏర్పడింది. మర్నాటికి అది 50 అడుగులకూ, 26 నాటికి 200 అడుగులకూ పెరిగి, క్రమంగా 1500 అడుగుల ఎత్తయి, చుట్టూ విస్తరించ నారంభించింది. దాని నుంచి వెలువడిన లావా (శిలాద్రవం) చుట్టుపక్కల విస్తరించి, రెండు గ్రామాలనూ, విస్తీర్ణమైన మొక్కజొన్న చేలనూ, అరణ్యాలనూ ధ్వంసం చేసేసింది.





# కథల ప్రయోజనం

ఒక గ్రామంలో కృష్ణశర్మ అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన వేద, శాస్త్ర, పురాణాలు సమస్తమూ చదివాడు. ఆయన సంపన్నుడు కావటం చేత సంపాదన కోసం ప్రయత్నించక, కులాసాగా కాలం గడిపేవాడు. సాయంకాలం వేళ ఆయన ఇంటికి ఊళ్ళోవాళ్ళు అనేక మంది వచ్చేవారు. ఆయన సమయోచితంగా వాళ్ళకు రకరకాల కథలు చెప్పి, ఆనందింపచేస్తూ ఉండేవాడు.

కృష్ణశర్మకు వేదశర్మ అనే కొడుకు ఉండేవాడు. అతను కూడా బాగా చదువుకుని, రాజుగారి వద్ద ఆస్థానపండితుడుగా పని చేస్తున్నాడు. తండ్రి జీవించే పద్ధతి అతనికి నచ్చేది కాదు.

''మీరు మీ విజ్ఞానాన్ని ఎందుకు వ్యర్థం చేస్తూ కథలు చెబుతారు?'' అని వేదశర్మ తండ్రిని అడిగాడు.

''ఒక పిట్ట కథతో ఎన్ని పనులైనా చెయ్యవచ్చు. ఎదటి వాడి మీద దెబ్బ తీయవచ్చు. గడ్డు సమస్యను తేలికగా అర్థమయేటట్లు చేయవచ్చు. అవతలి వాళ్ళ మనసుకు ఆనందం కలిగించవచ్చు. మెదడుకు పదును పెట్టవచ్చు," అన్నాడు కృష్ణశర్మ.

ఈ సమాధానం వేదశర్మకు తృప్తి కలిగించ లేదు. అయినా ఏమీ అనలేక ఊరుకున్నాడు.

ఒకసారి వేదశర్మ రాజుగారి పని మీద సముద్రం దాటి మయూరదేశం వెళ్ళవలసి వచ్చింది. అతన్ని అంతదూర ప్రయాణం మీద ఒంటిగా పంపటం ఇష్టం లేక, అతని వెంట కృష్ణశర్మ కూడా బయలుదేరాడు.

మయూరదేశం చేరిన మర్నాడు వేదశర్మ తాను వచ్చిన పని ముగించు



కున్నాడు. అతని గౌరవార్థం ఒక విందు ఏర్పాటు చేశారు. వేదశర్మా, అతని తండ్రీ శాకాహారులనీ, మద్యం ముట్టరనీ ఆ దేశపురాజుకు తెలుసు. అందువల్ల వారికి తగినట్టుగానే విందు ఏర్పాట్లు జరిగాయి.

అక్కడి ఆస్థాన విదూషకుడికి వేదశర్మను ఎగతాళి పట్టించా లనిపించింది. విందు సమయంలో అతను వినయంగా వేదశర్మను సమీపించి, ఏవేవో మద్యాల పేర్లు చెప్పి, ''మీరు ఏది పుచ్చుకుంటారు?'' అని అడిగాడు.

వేదశర్మ తెల్లబోయి, అవేమిటో తనకు తెలియవని అన్నాడు.

మహారాజు లాటి వాళ్ళు మర్యాదకు నవ్వకపోయినా, చాలా మంది వేదశర్మ అజ్ఞానానికి నవ్వారు. వెంటనే కృష్ణశర్మ విదూషకుడితో, ''ఈ నవ్వు నాకు కొంగల నవ్వును గుర్తు చేస్తోంది,'' అన్నాడు.

''కొంగల నవ్వా? అదేమిటి?'' అని విదూషకుడు అడిగాడు.

''మరేమీ లేదు. ఒకసారి మానస సరోవరంలో ఉండే ఒక రాజహంస దారి తప్పి ఒక కొంగల గుంపు మధ్య వాలింది. కొంగలు దాన్ని ఏవో ప్రశ్నలు వేశాయి. హంస వాటికి ఓపికగా సమాధానాలు చెప్పింది. 'నువు ఏం తింటావు?' అని కొంగలు అడగగా, 'లేతతామర తూండ్లు తింటాను,' అని హంస జవాబు చెప్పింది. 'నత్తలూ, పీతలూ తినవా?' అని కొంగలు అడిగాయి. అవి ఏమిటో తనకు తెలియదని హంస చెప్పేసరికి, కొంగలు విరగబడి నవ్వాయి,'' అన్నాడు కృష్ణశర్మ.

ఈసారి మహారాజుతో సహా అందరూ నవ్వారు. విదూషకుడి ముఖం మాడిపోయింది. విందు ముగిసినాక విదూషకుడు తండ్రి కొడుకు లిద్దరినీ తన ఇంటికి భోజనానికి ఆహ్వానించాడు. ఆ రాత్రి వాళ్ళు విదూషకుడి ఇంటికి భోజనానికి వెళ్లారు. విదూషకుడు ఇంకా చాలా మందిని ఆహ్వా

నించాడు. అందరితో బాటు తండ్రి కొడుకులకు కూడా గోమాంసం వడ్డించారు. కృష్ణశర్మ అభ్యంతరం చెప్పాడు.

విదూషకుడు పొరపాటు జరిగి పోయిందని ఒప్పుకుని, ఇలా అన్నాడు :

''నేను కూడా ఈ దేశానికి రాక ముందు మద్య మాంసాలు ముట్టని వాణ్ణే. కాని, ఇక్కడ స్థిరపడ్డాక, పరిస్థితులనుబట్టి నా అలవాట్లు మార్చుకున్నాను. మీరు కూడా అలా ఎందుకు చేయగూడదు ? ''

దీనికి ఏం జవాబు చెబుతాడో నని అందరూ కృష్ణశర్మ కేసి కుతూహలంగా చూశారు.

''ప్రవర్తన మార్చుకోవటం మనిషి స్థాయినిబట్టి ఉంటుంది. వెనకటికి ఒక సింహం ఒక పశువుల కొట్టంలో చిక్కుబడిపోయింది. ఆ కొట్టంలో పశువులైతే లేవు గాని, బోలెడంత గడ్డి ఉన్నది. సింహం బయటికి రాలేకపోయింది. అది ఆకలితో రెండు వారాలపాటు మలమలా మాడింది. అయినా అది జంతుమాంసం కోసం ఎదురు చూసిందే గాని, గడ్డి ముట్ట లేదు,'' అన్నాడు కృష్ణశర్మ.

విదూషకుడికి మరొకసారి పరాభవం జరిగింది. అతను కృష్ణశర్మకు క్షమాపణ చెప్పుకుని, ఆయనకూ, ఆయన కొడుక్కూ తగిన భోజనం ఏర్పాటు చేశాడు.

తండ్రి చెప్పే కథల ప్రభావం వేదశర్మకు తెలిసి వచ్చింది. తిరుగు ప్రయాణంలో అతను తండ్రిని మెచ్చుకుని, ''మీరు



చెప్పిన కథలు నాకూ తెలుసు. కాని వాటిని ఇలా ఉపయోగించ వచ్చునని నాకు తెలియదు. కథలతో ఎదటి వాడిని దెబ్బ కొట్టటమూ, మెదడుకు పదును పెట్టటమూ ఇప్పుడు చూశాను. రోజూ మీరు ఎందరికో కథలతో సంతోషం కలిగిస్తున్నారు. నా కొక సమస్య ఉన్నది. ఆస్థానంలో నా కింద ఎందరో ఉద్యోగు లున్నారు. వాళ్ళపట్ల నే నెంతో ప్రేమాభిమానాలు కలిగి ఉంటాను. అది అలుసుగా తీసుకుని, వాళ్ళు నన్ను లోకువ కట్టేసి, గౌరవించటం తగ్గించారు. అందుచేత నే నిప్పుడు వాళ్ళపట్ల కఠినంగా ఉంటున్నాను. ప్రస్తుతం వాళ్ళు నన్ను చూసి హడిలిపోతున్నారు. ఇదీ నాకు తృప్తిగాలేదు. వాళ్ళకు నా మీద గౌరవం ఉండాలి, భయం ఉండరాదు," అన్నాడు.

కృష్ణశర్మ నవ్వి ఇలా అన్నాడు:

"ఇదే సమస్య ఒకప్పుడు ఒక పాముకు వచ్చింది. 'అది ఒక ముని వద్దకు వెళ్ళి, 'ప్రజలకు నేనంటే అసహ్యం ఉండకుండానూ, భయం ఉండకుండానూ ఒక మార్గం చెప్పండి,' అని అడిగింది. ఎవరికీ హాని చెయ్యవద్దు అని ముని చెప్పాడు. అలాగే పాము సాధువులా ప్రవర్తించ సాగింది. త్వరలోనే దాని సంగతి అందరికీ తెలిసిపోయింది. చిన్న పిల్లలు కూడా దాన్ని బాధించసాగారు. అది నానా అవస్థలూ పడుతూండగా ముని దాన్ని చూసి, జాలిపడి, 'నా సలహా నువు తప్పుగా అర్థం చేసుకున్నావు. నిన్ను కరవ వద్దన్నాను గాని, బుస కొట్టవద్దన్నానా? నువు ఎవరికీ హాని చెయ్యకు, కాని ఇతరులు నీకు హాని చేసేలా ఉంటే బుస కొట్టు,' అన్నాడు."

తండ్రి చెప్పిన ఈ కథ విన్న తరవాత వేదశర్మకు, తన కింది వాళ్ళతో ఎలా ప్రవర్తించాలో అర్థమైపోయింది. అది మొదలు అతను కథలవల్ల లాభం గుర్తించి, తను కూడా కథలు చెప్పడం నేర్చుకున్నాడు.






కర్మపూరు రాజయిన బోపదేవుడికి మగ పిల్లలు లేరు. ఇద్దరు కుమార్తెలు మాత్రం ఉన్నారు. వారు కవలపిల్లలు. కాని వారిలో ఒకతె తెల్లనిది. ఆమె పేరు శ్వేత. రెండవ పిల్ల నల్లనిది. ఆమె పేరు కృష్ణ. రంగులో తేడా ఉన్నా, ఇద్దరూ ఒకే పోలిక. ఇద్దరు పిల్లలూ చాలా గారాబంగా పెరిగి పదేళ్ళ వయసు గలవాళ్ళయారు.

ఒకనాడు శ్వేతా, కృష్ణా ఉద్యానంలో నడుస్తూండగా, ఒక చెట్టు మీది నుంచి ఒక పక్షిగూడు వాళ్ళ కాళ్ళముందు పడింది. వాళ్ళు బెదిరిపోయి, పెద్ద పెట్టున ఏడవసాగారు. అది విని పరిచారకులు పరిగెత్తుతూ వచ్చి, పక్షిగూడు చూశారు. అందులో రెండు గుడ్లు ఉన్నాయి. పరిచారకులు ఆ గూటిని గుడ్లతో సహా మల్లెపాదలలో పారేసి, రాజకుమార్తెలను రాజభవనంలోకి తీసుకుపోయారు.

కాని భయంతో రాజకుమార్తెలకు జ్వరం తగిలింది. చికిత్సలతో ఆ జ్వరం తగ్గలేదు. ఒక రాత్రి రాజుకు ఒక విచిత్రమైన కల వచ్చింది. ఆ కలలో రాజు తన ఉద్యానవనంలో ఒక పంచరంగుల పక్షిని చూశాడు. ఆ పక్షి మనుష్యభాషలో రాజుతో ఇలా అన్నది :

"రాజా, నేను దేవతా పక్షిని. నేను ఈ తోటలో ఒక చెట్టుమీద గూడుకట్టి, అందులో రెండు గుడ్లు పెట్టాను. వాటిని పొదిగి పిల్లలను చేసి, నీ కుమార్తెలకు బహుమానంగా ఇద్దామనుకున్నాను. కాని, మూఢులైన నీ పరిచారకులు ఆ గుడ్లను మల్లెపొదలలో పారేశారు."

"నేను ఇప్పుడే ఆ గుడ్లను వెదికి తెప్పిస్తాను," అన్నాడు రాజు.



"ఆ కొండ శిఖరం నిటారుగా ఉంటుంది. దాన్ని ఎక్కటం అసాధ్యం. ఆ శిఖరం మీదికి ఎవరూ, ఎన్నడూ ఎక్కి ఉండలేదు," అన్నాడు రాజు.

"నువు ఎలా ఎక్కుతావో నాకు తెలీదు. కాని నువు ఆ పక్షులను తెచ్చే దాకా నీ పిల్లల జ్వరం తగ్గదు. ఇంకొకటి ఏమిటంటే, గుడ్లు వజ్రాలుగా మారి నప్పుడు ఒకటి తెల్లగా ఉంటుంది, ఒకటి గులాబి రంగులో ఉంటుంది. శ్వేత గులాబి రంగుగల వజ్రాన్ని తీసుకోవాలి. కృష్ణ తెల్లని వజ్రాన్ని తీసుకోవాలి. అలా చెయ్యకపోతే ఇద్దరికీ ప్రమాదమే," అని చెప్పి పక్షి మాయమయింది.

"అది ఇప్పుడు సాధ్యం కాదు. అవి చిట్లటమూ; వాటి నుంచి పిల్లలు బయటికి వచ్చి ఎగిరి పోవటమూ జరిగింది. అవి ఇప్పుడు నీ రాజ్యంలో పడమటగా ఉన్న కొండశిఖరం మీద ఉంటున్నాయి. నువు స్వయంగా ఆ శిఖరం ఎక్కి, వాటిని తీసుకువచ్చి, వాటికి ఇంపుగా ఉండే ఆహారం పెట్టాలి. అవి తృప్తిపడితే నీకు రెండు గుడ్లు ఇస్తాయి. అయిదేళ్ళ అనంతరం ఆ గుడ్లు వజ్రాలుగా మారి పోతాయి. కొండశిఖరం ఎక్కి ఆ పక్షు లను నువు రాజభవనానికి తీసుకు రాగానే నీ పిల్లల జ్వరం తగ్గిపోతుంది," అన్నది పక్షి.

బోపదేవుడు వెంటనే నిద్రలేచి, రాణికి తన కల చెప్పాడు.

మర్నాడు ఉదయం ఆయన తన మంత్రులను సమావేశపరిచి వారితో తన కల గురించి చర్చించాడు. వాళ్ళు ఏమీ చెప్పలేక పోయారు. రాజు దేవాలయా నికి వెళ్ళి దేవుణ్ణి ప్రార్థించాడు.

అకస్మాత్తుగా దేవుడి విగ్రహం కింది నుంచి ఒక ఉడుము ఇవతలికి వచ్చి, గోడ మీదికి పాకి, మళ్ళీ గోడ దిగి, రాజుకు సమీపంగా వచ్చి నిలిచింది.

రాజపురోహితుడు రాజుతో, "మహా రాజా, దేవుడు తమపట్ల అనుగ్రహించి,

తమకు సహాయంగా ఉడుమును పంపాడు," అన్నాడు.

"ఇది నాకు ఎలా సహాయపడుతుంది, శాస్త్రిగారూ?" అన్నాడు రాజు.

"అదే చూపింది గద! కోటగోడల లాటివి ఎక్కటంలో ఉడుములాటిది మరొకటి లేదు. దాని పట్టు అమోఘం. దాని నడుముకు తాడు కట్టి కొండశిఖరం మీదికి పంపితే, ఆ తాడు పట్టుకుని మీరు నిశ్చింతగా పైకి ఎక్కవచ్చు," అన్నాడు రాజపురోహితుడు.

ఎందుకైనా మంచిదని శిఖరం దిగువన బలమైన వలలు, రాజుగారు కింద పడితే దెబ్బ తగలకుండా, ఏర్పాటు చేశారు. ఉడుముకు మంచి బలమైన తిండి పెట్టారు. ఒక రోజు ఉదయం రాజు తన ఖడ్గమూ, ఆహారమూ, నీరూ తీసుకుని సైనికులు వెంటరాగా కొండకు బయలుదేరాడు.

ఉడుము నడుముకు తేలికగానూ, దృఢంగానూ ఉండే తాడు కట్టి, శిఖరం మీదికి పంపారు. అది పైకి చేరగానే ఇద్దరు సైనికులు తాడును లాగి పట్టుకున్నారు. వెంటనే ఉడుము రాతిని కరుచుకున్నది. ఇద్దరూ పట్టి లాగినా ఉడుము తన పట్టు వదలలేదు. తరవాత రాజు దైవధ్యానం చేసుకుని, ఆ తాడు పట్టుకుని పైకి ఎక్కి వెళ్ళాడు. దిగువన రాజుగారి మనుషులూ, రాణీ భయపడుతూ నిలబడి ఉన్నారు.





రాజు శిఖరం మీదికి చేరేసరికి సూర్యుడు అస్తమించి, పూర్ణచంద్రుడు ఉదయించాడు. రాజు తాడును ఉడుము నడుము నుంచి ఊడదీసి, దాని కొసను ఒక బలమైన కొండరాయికి బిగించాడు. చంద్రకాంతిలో ఆయనకు ఒక పొట్టి చెట్టు కనబడింది. దాన్ని సమీపించేటప్పుడు ఆయనకు దాని మీద రెండు పక్షులు కనిపించాయి. ఆ చెట్టు మొదలును ఒక రెండు తలల పాము చుట్టుకుని ఉంది. ఆయనను చూసి తన రెండు పడగలూ విప్పి, నోళ్ళు తెరిచి, కోరలు బయటపెట్టింది. రాజు తన కత్తితో బలంగా కొట్టి, పాముతలలు నరికేశాడు.

బోపదేవుడు చెట్టు మీది పక్షులనూ, ఉడుమునూ తీసుకుని శిఖరం దిగి కిందికి చేరేసరికి తెల్లవార వస్తున్నది. కింద ఉంచగానే, ఉడుము చిత్రంగా రెక్కలు పెంచుకుని, ఆకాశంలోకి ఎగిరిపోయింది. ఆయన పక్షులతో సహా ఇల్లు చేరుకునేసరికి రాజకుమార్తెలకు జ్వరం పోయింది. మర్నాడు పక్షులు రెండు గుడ్లు పెట్టి, మాయమైపోయాయి.

రాజు ఆ గుడ్లను ఒక వెండిబుట్టలో ఉంచి, దాన్ని ఇనపపెట్టెలో భద్రం చేయించాడు.

అయిదేళ్ళు గడిచాయి. శ్వేతా, కృష్ణా పెరిగి, పదిహేనేళ్ళవాళ్ళు అయారు. రాజు ఇనపపెట్టె తెరవగానే దానినుంచి కాంతికిరణాలు వెలువడ్డాయి. గుడ్ల స్థానంలో రెండు వజ్రాలు ధగధగా మెరుస్తూ కనిపించాయి. ఒకటి తెల్లగా ఉన్నది. రెండోది గులాబి రంగుగా ఉన్నది.

వాటిని రాజు బయటికి తీయించినప్పుడు రాజకుమార్తెలు అక్కడే ఉన్నారు.

రాజు వారితో, ''అమ్మళ్ళూ, ఈ వజ్రాలు మీకే! ఇవి మీకు అదృష్టం కలిగిస్తాయి. ఏ వజ్రం ఎవరిది అన్న విషయం మీరు విచారించకండి. ఇవాళ సాయంకాలం

మీ కిద్దరికీ తెల్ల సంపంగిపూలు కూజాల్లో పెట్టి ఇస్తాను. మీరు రోజూ ఆ పూలను గమనిస్తున్నట్టయితే, ఏ వజ్రం ఎవరిదో మీకే తెలిసిపోతుంది,'' అన్నాడు.

ఆ రోజే ఆయన ఆస్థాన ఇంద్రజాలికుడైన మాయాపాలుణ్ణి రహస్యంగా తన అభ్యంతర మందిరానికి పిలిపించి, ''వజ్రాలు వచ్చాయి. ఇక నీ ఇంద్రజాలం ప్రయోగించే సమయం వచ్చింది,'' అన్నాడు.

''అదంతా మీరే చెయ్యవచ్చు గదా, మహారాజా! శ్వేతకు ఇచ్చే తెల్ల సంపంగి పూల పాత్రలో కొంచెం ఎర్ర సిరాకలిపి, పూలకాడలు అందులో మునిగేటట్టు అమర్చటమే గదా! క్రమంగా పూల రెక్కలు వాటంతట అవే గులాబిరంగుకు మారుతాయి. ఇదంతా ముందే మీకు చెప్పేశానుగా?'' అన్నాడు మాయాపాలుడు.

''చెప్పావనుకో. అయినా అది నీ చేతి మీదుగా జరిగితేనే బాగుంటుంది గదా!'' అన్నాడు రాజు. ఇద్దరూ నవ్వుకున్నారు.

ఆ రాత్రి శ్వేతకూ, కృష్ణకూ రెండు గుత్తుల తెల్ల సంపంగిపూలు పాత్రలతో సహా అందాయి. పాత్రల మీద ఇద్దరి పేర్లూ స్పష్టంగా రాసి ఉన్నాయి. వాళ్ళు ఆ పాత్రలను తమతమ గదులలో ఉంచుకుని, పూలను శ్రద్ధగా గమనిస్తూ వచ్చారు. కృష్ణకు ఇచ్చిన పూలు మొదట ఉన్నట్టే తెల్లగా ఉండి పోయాయిగాని, శ్వేత కిచ్చిన పూలు మర్నాటికే రంగు మారనారంభించాయి.

ఈ సంగతి తెలియగానే బోపదేవుడు తన కుమార్తెల వద్దకు వెళ్ళి, ''అమ్మాయిలూ, ఏ వజ్రం ఎవరిదో ఇప్పుడు మీకు తెలిసింది గద?'' అంటూ పళ్ళెంలో ఉన్న వజ్రాలు చూపాడు. శ్వేత గులాబీ వజ్రాన్ని తీసుకున్నది. కృష్ణ తెల్ల వజ్రాన్ని తీసుకున్నది.

మాయాపాలుడి మాటా? ఎంతో గడ్డు సమస్యను తేలిగ్గా పరిష్కరించినందుకు అతనికి బోపదేవుడి నుంచి మంచి బహుమానమే లభించింది.







# వస్త్రలోభం

అలివేలూ, అనంతయ్యా భార్యా భర్తలు. అనంతయ్యా తిండి కోసం ఎంతయినా ఖర్చు పెడతాడు గాని, బట్టలకు ఖర్చు పెట్టడు. అలివేలు ఇందుకు విరుద్ధం. వంటింట్లో ఏం తిన్నా నలుగురి ముందూ బాగా కనబడాలని ఆమె ఉద్దేశం. భర్త కొని పెట్టడు గనుక, ఆమె పుట్టింటి నుంచి సంవత్సరానికి ఆరు చీరలు తెప్పించుకునేది. అనంతయ్యా చిరిగిన బట్టలనే కుట్టుకుని వాడుకునేవాడు.

అనంతయ్యా దగ్గిర ఉన్న బట్టలలో కెల్లా అతి పురాతనమైనది, ఒక గళ్ళ గావంచా. ఆ అభిమానం కొద్దీ, పేలికలైన ఆ గావంచాను వదులుకోలేదు అనంతయ్యా. తన భర్త ఆ చిరుగుల గావంచా కట్టుకుని నలుగురి మధ్యా తిరుగుతూంటే అలివేలుకు తల తీసేసినట్టుగా ఉండేది. రోజూ భార్యా భర్తలిద్దరూ ఆ గళ్ళ గావంచా గురించి తగవులాడుకునే వారు.

ఒకనాడు అనంతయ్యా స్నానం చేసి, తన గావంచాను ఉతికి, గాలికి ఎగిరి పోతుందని దాన్ని ఇంట్లో ఆరవెయ్యటానికి తెచ్చాడు. అప్పుడే అలివేలు వంటింట్లో నుంచి వచ్చి, "మా అక్క వస్తానని కబురు చేసింది. నా పూసల సంచీ పూసలు కొన్ని ఊడిపోయాయి. పట్నం తీసుకుపోయి అల్లించుకురా. ఆ దిక్కుమాలిన గావంచా ఊరవతల పారెయ్యి. మా అక్క చూస్తే నవ్వుతుంది." అన్నది.

అనంతయ్యా భార్య మాటలు వినిపించుకోకుండా గావంచాను దండెం మీద ఆరేస్తూ, "నీ పూసల సంచీ బాగుచేయించటమేనా నాకు పని?" అని అడిగాడు.

అలివేలుకు కోపం ముంచుకొచ్చి, గావంచాను లాక్కుని పెరట్లోకి విసిరివేసి,

ఎం. కామేశ్వరరావు

"ఆ గావంచా ఇంట్లో ఆరవేస్తే ఇల్లంతా కుళ్ళు కంపు!" అన్నది.

అనంతయ్య ఆ గావంచాను మళ్ళీ తడిపి, పిండి, వీధి కటకటాలలో ఆర వేశాడు. అతను భోజనం చేసి కోమటి వద్ద పద్దులు రాయటానికి వెళ్ళిపోయినాక, అలివేలు ఆ గావంచాను తన అక్క వచ్చేలోగా ఎలా వదిలించుకోవటమా అని ఆలోచించసాగింది.

ఎండవేళ దారివెంట నడిచిపోతూ ఒక ముసలి బిచ్చగాడు ఆమెకు కనిపించాడు. ఆమె వాణ్ణి పిలిచి, ఆ గావంచా పట్టుకు పొమ్మన్నది. ఆ బిచ్చగాడు గావంచా కేసి చీదరించుకుంటూ చూసి, "ఈ కుళ్లుబట్ట నాకు దేనికి?" అంటూ పోబోయాడు.

"బాబ్బాబు, ఒక రూపాయి ఇస్తాను గాని, దాన్ని పట్టుకుపో," అని అలివేలు వాణ్ణి బతిమాలింది.

బిచ్చగాడు ఒక రూపాయి పుచ్చుకుని ఆ గావంచా పట్టుకుపోయాడు.

అనంతయ్య ఆ సాయంత్రం ఇంటికి వస్తూండగా ఆ బిచ్చగాడు కనిపించాడు. వాడి భుజం మీద తన చిరుగుల గావంచా ఉన్నది. అనంతయ్య ఆవేశంతో బిచ్చ గాడి పీకపట్టుకుని, "దొంగపీనుగా! నిక్షేపంలాటి నా గావంచా దొంగిలిస్తావా?" అన్నాడు.



"చాల్చాల్లేవయ్యా. ఎవరో ఇల్లాలు వద్దంటుంటే బలవంతంగా నాకు దీన్ని అంటగట్టింది," అని బిచ్చగాడు విసురుగా తన దారినపోయాడు.

అనంతయ్య అంతకన్న విసురుగా తన ఇంటి కేసి నడిచాడు. గుడికి వెళుతూ అలివేలు అతనికి దారిలోనే ఎదురయింది.

"ఏమే, నా గావంచా బిచ్చగాడి కిచ్చావా?" అని అనంతయ్య అలివేలును అడిగాడు.

"అవును! అది విరగడ అయినందుకు దేవుడికి కొబ్బరికాయ కొట్టబోతున్నాను," అనేసి అలివేలు వెళ్ళిపోయింది. అనంతయ్య కోపంతో పళ్ళు పటపట

కొరికాడు. ఎలాగైనా ఆ గావంచా తిరిగి తెచ్చుకోవాలని నిశ్చయించుకుని, అనంతయ్య ఇంటికిపోయి, గోడకు తగిలించి ఉన్న పూసలసంచీ తీసుకుని, పొరుగింటి పుల్లమ్మతో, "అలివేలు వస్తే, పూసల సంచీ అల్లించటానికి పట్నం వెళ్ళానని చెప్పండి," అని చెప్పి బయలుదేరాడు.

అనంతయ్య నలుగురినీ వాకబు చెయ్యగా ఆ బిచ్చగాడు ఊరి చివర ఉన్న మర్రిచెట్టు కింద వుంటున్నాడని తెలిసింది. అతను అక్కడికి వెళ్ళేసరికి బిచ్చగాడు ఇంకా వచ్చి చేరలేదు. వాడి గుడ్డిపెళ్ళాం చెట్టు మొదలుకు చేరగిలబడి కూర్చుని ఉన్నది. ఆమె పక్కన పాత అతుకుల సంచీ, దాని నిండా గుడ్డ పీలికలూ ఉన్నాయి. ఆమె చేతిలో ఒక చింత బరికె ఉన్నది. అనంతయ్య దగ్గిరిగా వచ్చేసరికి గుడ్డిది అతని కాలిమీద బరికెతో కొట్టి, "ఎవడివిరా నువ్వు? గుడ్డి ముండను కదా అని ఏదన్నా పట్టుకు పోదామనుకున్నావా?" అన్నది.

అనంతయ్య బాధతో మూలుగుతూ, "నీ మొగుడి కోసం వచ్చాను," అన్నాడు.

"అయితే చీకటి పడ్డాకరా!" అన్నది. గుడ్డిది.

అనంతయ్య వెళ్ళినట్టే వెళ్ళి, వెనక వైపుగా వచ్చి, అతి జాగ్రత్తగా మర్రిచెట్టు ఎక్కి కూర్చున్నాడు.

చీకటిపడి బిచ్చగాడు వచ్చి, "ఈ దరిద్రపు గావంచా దొరికిన వేళా



విశేషం ఏమిటోగాని రోజూ దొరికే దానిలో ఈ పూట సగం కూడా దొరకలేదు,'' అంటూ వాడు అనంతయ్య గావంచాని పేలికలున్న సంచీలో కుక్కేశాడు. అనంతయ్య మనస్సు చివుక్కుమన్నది.

తరవాత బిచ్చగాడు వంటచేసి, తానూ, తన భార్యా తిని, అర్థరాత్రి దాకా ఏవో పదాలు పాడుకుని, పడుకున్నారు. వాళ్లు మంచి నిద్రలో ఉన్నట్టు రూఢిచేసుకుని అనంతయ్య చెట్టు దిగబోతూండగా, ఇద్దరు దొంగలు ఆ చెట్టు సమీపానికి వచ్చి, ఏదో రహస్యంగా మాట్లాడుకున్నారు.

"ఎక్కడదాద్దాం?'' అన్నాడు ఒకడు.

"ఆ గుడ్డల సంచీలో దాద్దాం. చలి కాలం వచ్చేదాకా అందులో నుంచి వాళ్లు గుడ్డలు బయిటికి తీయరు,'' అన్నాడు రెండోవాడు.

తరవాత దొంగలిద్దరూ చెట్టు కింది చీకట్లోకి వచ్చి, బిచ్చగాడి గుడ్డ పేలికల సంచీ తీసి, అందులో ఏదో దాచి, వెళ్ళిపోయారు.

వాళ్ళు పారిపోతున్న అలికిడికి గుడ్డిది లేచి, "ఎవర్రా వాళ్ళూ ?'' అని అడిగి, సంచీని తడివి తీసుకుని తల కింద పెట్టుకుని, మళ్ళీ పడుకున్నది.

దొంగలు భయపడినట్టు అటుగా ఎవరూ రాలేదు. బిచ్చగాళ్ళ సంచీలో తన గావంచాతో బాటు దొంగలు దాచినది కూడా ఉండటం చేత, అనంతయ్యకు ఆ సంచీని తనది చేసుకోవాలనిపించింది.



తెల్లవారగానే అతను చెట్టుదిగి, బిచ్చగాడి దగ్గిరికి వచ్చి, "నీ దగ్గిర ఉన్న పాతబట్టల మూట ఇస్తావా? అలుకు గుడ్డలకు చాలా ఇబ్బందిగా ఉన్నది." అన్నాడు.

"ఇయ్యను!" అన్నాడు బిచ్చగాడు కచ్చితంగా.

"దానికి బదులుగా ఈ పూసలసంచీ తీసుకో," అన్నాడు అనంతయ్య.

గుడ్డిది పూసలసంచీని తడిమి చూసి ముచ్చటపడి, "బట్టల మూట ఇచ్చెయ్యి, ఇచ్చెయ్యి!" అన్నది మొగుడితో.

గుడ్డివాడు ఇచ్చిన సంచీని చంకలో పెట్టుకుని అనంతయ్య ఆనందంగా ఇల్లు చేరుకున్నాడు.

"రాత్రంతా ఎక్కడ ఉన్నావు? నా పూలసంచీ ఏదీ?" అని అలివేలు అనంతయ్యను చూడగానే అడిగింది.

"నీ పూసలసంచి ఇచ్చి ఇది పుచ్చుకున్నాను," అంటూ అనంతయ్య బిచ్చగాళ్ళ సంచీ చూపాడు.

"నీ మొహం తగలెయ్యా! ఎంతపని చేశావు! చంద్రహారం తెగితే నిన్న సాయంత్రం ఆ సంచీలో వేశాను. అది కూడా అతుకు పెట్టించుకు రమ్మందా మనుకున్నాను. ఆ సంచి ఇచ్చేసి మరిన్ని కుళ్ళు గుడ్డలు తెచ్చావా?" అంటూ అలివేలు మొగుడి చేతినుంచి సంచీని విసురుగా లాగేసి, వీధిలోకి గిరవాటు వేసింది.

ఆ విసురుకు సంచిలో ఉన్న బట్టలన్నీ బయట పడ్డాయి. వాటితోపాటు దొంగలు దాచిన కత్తి కూడా బయటపడింది. ఆ కత్తి మీద రక్తం మరకలున్నాయి. దొంగలు ఆ రాత్రే ఎవరినో హత్యచేసి, కత్తిని ఆ సంచీలో దాచి వెళ్ళిపోయారు.

వీధిలో జనం పోగయారు. త్వరలోనే రక్షకభటులు వచ్చి, ఆ కత్తినీ, అనంతయ్యనూ పట్టుకుపోయి ఖైదులో పెట్టారు.

అనంతయ్య తాను నిర్దోషినని రుజువు చేసుకోవటానికి బోలెడంత డబ్బు ఖర్చు అయి, తలప్రాణం తోకకు వచ్చింది.





# పాపపుణ్యాలు

తామ్రలిప్తిలో ధనగుప్తుడనే రత్నాల వ్యాపారి ఉండేవాడు. అతను నకిలీ వజ్రాలను మంచి వజ్రాల కింద అమ్మి అక్రమ వ్యాపారం చేసేవాడు. అసలు వజ్రాలనిపించే నకిలీ వజ్రాలను అతను విదేశాలలో కొనేవాడు. అతను ఇలాటి మోసాలను చాలా యుక్తిగా చేసి, సాధ్యమైనంతవరకు బయట పడేవాడు కాడు.

ఈ వ్యాపారి తన మనుషులనే ఓడలను కొల్లగొట్టటానికి నియమించి, వాళ్ళు దొంగతనం చేసిన మీదట, తన సరుకు దోచుకున్నారని, మిగిలిన వర్తకులతో బాటు తాను కూడా లబోమని ఏడ్చేవాడు. అతను న్యాయమైన వర్తకవ్యాపారి అనే అందరూ అనుకునేవారు.

ఒకసారి నావ దిగి వజ్రాలతో ఇంటికి వస్తున్న వ్యాపారికి దారిలో ఒక సన్యాసి ఎదురుపడి, అతన్ని ఎగా దిగా చూసి, "అయ్యా, గాజు పాత్రలోని రంగు నీళ్ళలాగా, మీలో ఉన్న పాపం బయటికి కనిపిస్తోంది. అది అగ్నిపర్వతం లాగా మిమ్మల్ని చీల్చుకుని బయటికి వచ్చే ప్రమాదం ఉన్నది. జాగ్రత్తపడు!" అన్నాడు.

వ్యాపారికి ఈ మాట వినగానే దడ పుట్టింది. ఈ విధంగా అతని అసలు రంగు కనిపెట్టినవాడు అంతవరకూ ఎవడూ లేడు. ఆ సన్యాసి ఎవరో సిద్ధపురుషుడి లాగున్నాడనుకుని, వ్యాపారి, "స్వామీ, నన్నేం చేయమంటారు?" అని అడిగాడు.

"నువు చేసిన పాపాలనుబట్టి ఉంటుంది. భూదానాలూ, గోదానాలూ చెయ్యి. అన్నదానాలు చెయ్యి. సాధు సన్యాసులకు సంతర్పణలు చెయ్యి. నీ పాపం శాంతిస్తుంది." అన్నాడు సన్యాసి.

బూర్లె నాగేశ్వరరావు



"అలా చెయ్యటానికి నాకేమీ అభ్యంతరం లేదు. కాని నాకు ఒక్క క్షణం తీరిక ఉండదు. ఎప్పుడూ దేశాంతరాలలోనే ఉంటూ ఉంటాను. నెలకు ఒక రోజైనా దేశంలో ఉంటానో, లేదో. అలాటప్పుడు ఈ పుణ్యకార్యాలకు తీరిక ఎక్కడ?" అని వ్యాపారి అడిగాడు.

"పుణ్యకార్యాలు నీపేరు మీద నీభార్య చేసినా చెయ్యవచ్చు," అని సన్యాసి వెళ్ళిపోయాడు.

వ్యాపారి ఇంటికి వచ్చి తన భార్యతో, "రేపటి నుంచీ నువు నా పేరు మీద దాన ధర్మాలు చెయ్యి. కొంత కాలంపాటు గోదానాలూ, అన్నదానాలూ, పూజలూ, వ్రతాలూ ఎడాపెడా చెయ్యి. నాకు క్షణం తీరదు. డబ్బు ఖర్చయితే అయింది," అన్నాడు.

వ్యాపారి భార్యకు ఈ మాట విని ఆశ్చర్యమూ, ఆనందమూ కలిగింది. ఆమెకు పుణ్యకార్యాలు చెయ్యటమంటే చాలా ఇష్టం. కాని భర్తకు అటువంటివి సరిపడేవి కాదు.

"ఏమిటి సంగతి?" అని ఆమె అడిగింది.

"మనం చాలా పాపాలు చేస్తున్నామట! నా శరీరం పాపాల పుట్టట! అది ఎప్పుడో ఒక్కసారిగా బద్దలవుతుందట! మనం తెలిసి ఏ పాపాలు చెయ్యటం లేదు. కాని తెలియక చేసినా పాపాలు పాపాలే గద! వాటికి శాంతి కోసం కొంత కాలం ధర్మకార్యాలు చేతాం. వెధవ డబ్బు! ఈ నా శరీరంలో సత్తువ ఉండాలే గాని ఎంత డబ్బయినా సంపాదించ గలను," అన్నాడు వ్యాపారి.

భార్య చాలా సంతోషించి, తనకు ఈ అవకాశం కలిగించిన సన్యాసికి మనసులోనే నమస్కారం చేసుకున్నది. ఆమె సంతోషం గమనించి వ్యాపారి, "నువు ఇల్లు మాత్రం ధర్మసత్రం చెయ్యకు. వచ్చే వాళ్ళలో దొంగ వెధవలుంటారు. నీ దానధర్మాలన్నీ ధర్మసత్రంలోనే చెయ్యి.

మనం ఎంత ధనవంతులమో అందరికీ ఎందుకు తెలియాలి ? '' అన్నాడు.

మర్నాటి నుంచీ ధర్మసత్రంలో పుణ్య కార్యాలు ప్రారంభమయాయి. వర్తకుడు వజ్రాల కోసం విదేశాలకు వెళ్ళిపోయాడు. ఆయన భార్య చేతిమీదుగా గోదానాలూ, భూదానాలూ, వస్త్ర దానాలూ, అన్న దానాలూ, పూజలూ, వ్రతాలూ ఎడతెరిపి లేకుండా జరిగి పోతున్నాయి. డబ్బు మంచి నీళ్ళలాగా ఖర్చవుతున్నది.

కాని వ్యాపారికి ఇందువల్ల మేలు జరగకపోగా కీడే జరిగింది. అతను దేశం కాని దేశంలో మొట్టమొదటి సారిగా నకిలీ వజ్రాలతో పట్టుబడి, జరిమానా కింద తన సరుకు యావత్తూ పోగొట్టుకుని, ఒక ఏడాదిపాటు కారాగృహంలో ఉంది, సాటి వర్తకుల మధ్య అవమానం పాలై, చావు తప్పి కన్ను లొట్టపోయి, ఇంటికి తిరిగి వచ్చాడు.

ఇంట్లో అతనికి గొడలు తప్ప ఏమీ కని పించలేదు. ఇల్లు సర్వమంగళంగానూ, ధర్మ సత్రం నిత్యమంగళంగానూ ఉన్నది. తాను వచ్చిన సంగతి కబురు చేసినా భార్య కదిలి రాకపోయేసరికి, అతనే భార్య దగ్గిరికి వెళ్ళి, అక్కడ పోగైన జనాన్ని చూశాడు. అతన్ని ఎవరూ గుర్తించలేదు. అతని భార్య అందరికీ పెడుతూ, అతని చేతిలో కూడా ఇంత ప్రసాదం పెట్టి, "మీరు వచ్చినట్టు తెలిసింది. కాని, చూశారుగా? ఏళ్ళం





దరిసీ వదిలేసి రావటానికి వీలు కాలేదు.'' అన్నది.

వ్యాపారి మండిపడి, చేతిలో ఉన్న ప్రసాదం ఆమె ముఖాన కొట్టి, ''నీచు రాలా, నా కన్నా వీళ్ళు నీకు ఎక్కువా? కొంపంతా గుల్ల చేసేశావు. ఇదేనా నేను నిన్ను చెయ్యమన్నది? చేసింది చాలు, ఇక ఇంటికి పద!'' అన్నాడు.

తాను చేసిన దాన ధర్మాలు ఇంత ప్రమాదం తెస్తాయని వ్యాపారి భార్య ఊహించలేదు. ఆమె వెంటనే సత్రం ఖాళీ చేసి, ఇంటికి వెళ్ళిపోయింది.

''నేను చేసిన పుణ్యకార్యాల ఫలిత మంతా ఏమైనట్టు? మీకు వ్యాపారంలో నష్టం ఎందుకు వచ్చిందీ?'' అని ఆమె భర్తను అడిగింది.

''ఆ సంగతంతా నేను చూసుకుం టాను. నువు నీ కర్మకాండ మానెయ్యి.'' అన్నాడు వ్యాపారి.

అతనికి మళ్ళీ వ్యాపారంలో అంతులేని లాభాలు రాసాగాయి. నకిలీ వజ్రాల వ్యాపారంతో అతను కొద్ది కాలంలోనే తిరిగి వెనకటి అంత ధనం కూడబెట్టాడు. ఇంతకాలమూ తాను దారేపోయే సన్యాసి మాటలు విని ఉన్నదంతా లోకుల పాలు చేసినందుకు అతను చాలా విచారించాడు.

కొంతకాలం గడిచాక వ్యాపారి వజ్రా లతో ఇంటికి తిరిగి వస్తూండగా అతనికి మళ్ళీ ఆ సన్యాసి ఎదురయాడు. అతని వెంట ఇప్పుడు కొందరు శిష్యులు కూడా ఉన్నారు.

''నువు నేను చెప్పిన విధంగా చేసి నట్టు లేవు. నీలో ఏమీ మార్పు కన బడటం లేదు,'' అన్నాడు సన్యాసి వ్యాపారితో.

వ్యాపారి మండిపడుతూ, ''నువ్వొక శనిగాడివి! నీ మాటలు నమ్మి, కూడ బెట్టిందంతా సన్యాసులకూ, సాధువులకూ ధారపోశాను. దివాలా తీశాను. ఇక ఎన్నడూ నీలాటి వాళ్ళ మాటలు విన దల్చుకోలేదు. వెళ్ళు, వెళ్ళు!'' అన్నాడు.

"చేసుకున్న పుణ్యం కూడా, పాపం లాగే, ఊరికేపోదు. అసలు ఏం జరిగింది ?" అని సన్యాసి అడిగాడు.

"నా భార్య చెయ్యని వ్రతాలు లేవు, దానాలు లేవు. మరి ఆ పుణ్యమంతా ఏమయిందోగాని, నేను చేసిన ప్రతి వ్యాపారంలోనూ నష్టం వచ్చింది. నకిలీ వజ్రాల వ్యాపారం చేస్తూ దేశాంతరంలో పట్టుబడి, ఒక సంవత్సరం కారాగృహంలో ఉండి, ఇంటికి వస్తూనే నా భార్య చేసే దాన ధర్మాలన్నీ అపు చేయించాను. తిరిగి వ్యాపారం సాగించాను. కలిసి వచ్చింది. లక్షలు గడించాను. వజ్రాలు సులభంగా మారుతున్నాయి. కావాలంటే చూడు," అన్నాడు వ్యాపారి.

వ్యాపారి చూపిన నకిలీ వజ్రాలు చూసి సన్యాసి తల ఊపాడేగాని ఏమీ మాట్లాడలేదు.

"ఇప్పుడు చెప్పు, నువు చెప్పింది పుణ్యమా, నేను చేసింది పుణ్యమా? నీలాటి దొంగ సన్యాసులను పొలిమేర లోపల తిరగనియ్యటం రాజుది బుద్ధి తక్కువ!" అన్నాడు వ్యాపారి.

"బాగా చెప్పావు," అంటూ రాజు తన గడ్డాలూ, మీసాలు తీసివేసి, అసలు రూపంతో బయటపడ్డాడు.

వ్యాపారికి నోట మాట రాలేదు. రాజు వెంట ఉన్నవాళ్ళు కూడా తమ పెట్టుడు గడ్డాలు తీసివేసి, వ్యాపారిని వజ్రాలతో సహా బంధించారు.



తరవాత వ్యాపారి పైన విచారణ జరిగింది. రాజు అతనికి ఆజన్మకారాగార శిక్ష విధించాడు.

వ్యాపారి కారాగృహానికి పోబోతూ, "మహారాజా, నాకు కొన్ని అనుమానాలున్నాయి. వాటికి సమాధానం చెబుతారా?" అని అడిగాడు.

రాజు అడగమన్నాడు.

"నన్ను మొదటిసారి చూసినప్పుడే ఎందుకు బంధించలేదు? పైగా, సాధువులకూ, సన్యాసులకూ దానధర్మాలు చెయ్యమన్నారు ఎందుచేత? నా భార్య సంపాదించిన పుణ్యం నాకు ఎందుకు పనికిరాలేదు?" అని వ్యాపారి రాజును అడిగాడు.

రాజు ఇలా చెప్పాడు:

"పిచ్చివాడా, నిన్ను మొదటిసారి చూసినప్పుడే బంధించటానికి నువు దొంగ వ్యాపారివని నాకేం తెలుసు? నీ ముఖం చూసి అనుకున్నాను, అంతే. అయితే నీలో పాపభీతి చూసి, నువు దానధర్మాలు చెయ్యటానికి అంగీకరించిన మీదట ఆ సంగతి నాకు రూఢి అయింది. అయినా ఆధారం లేక నిన్ను ఎలా బంధించను? ఆ నాటి నుంచి నా వేగులు నీ వెంట ఉంటున్నారు. నువు ఏం చేస్తున్నదీ ఎప్పటికప్పుడు నాకు తెలుస్తూనే ఉన్నది.

"ఇకపోతే, నీ రెండో ప్రశ్నకు సమాధానం. నీలాటి పాపులు పుణ్యం చేసుకుంటే, ఆ పుణ్యం శత్రువై కూర్చుంటుంది; మీ చేత మంచి పనులు చేయించాలనుకుంటుంది; మీ మోసాలకు విఘ్నాలు కలిగిస్తుంది. మీ మంచి కోరే అది అలా చేస్తుంది. నీ భార్య ఇచ్చిన ప్రసాదాన్ని ఆమె ముఖాన కొట్టావు. అంత దాకా నీ వెంట ఉన్న పుణ్య ఫలితం నీకు దూరంగా పోయింది. నిన్ను పాపం చేరుకుని, నీ ఆటలు సాగనిచ్చింది. ఆ విధంగా అది నీ పతనానికి తోడ్పడింది."

రాజు ఇలా చెప్పిన మీదట వ్యాపారిని రాజభటులు కారాగృహానికి తీసుకుపోయారు.





# నిజమైన సంతోషం

ఒక ఊళ్ళో ఒక గృహస్థుకు ముగ్గురు కొడుకులు ఉండేవారు. తండ్రి ఖజానాలో రాతగాడుగా ఉండి, ఏ కొరతా లేకుండా కొడుకులను పోషిస్తూ వచ్చాడు. ఆయన పెద్దవాడయిపోయి, ఆరోగ్యం చెడిపోయినందున ఖజానా ఉద్యోగం మానుకుని, ఇంటిలో విశ్రాంతి తీసుకోసాగాడు.

తండ్రి బాగానే సంపాదించాడు గాని, కొడుకులు తిని తిరగటంతప్ప ఏ ఉద్యోగంలోనూ ప్రవేశించలేదు. అది చూసి తండ్రి, ముగ్గురు కొడుకులనూ పిలిచి, "ఇన్నాళ్లూ నేను మిమ్మల్ని పోషించాను. ఇప్పుడు నేను మూల పడ్డాను. మీకు వయసు వచ్చింది. ఇక మీరే నన్ను పోషించాలి. మీకు తలా ఒక నూరు రూపాయలూ ఇస్తాను. వాటిని తీసుకుని మీరు ఎటైనా వెళ్ళండి. ఏమైనా చెయ్యండి. ఒక సంవత్సరానికి మీరు నాకు సంతోషం కలిగించే పనులు చేసి, తిరిగి రండి," అన్నాడు.

ఐశ్వర్యం కన్న మనిషిని సంతోష పెట్టేది మరే ముంటుందనుకుని, పెద్దవాడు నగరానికి వెళ్ళి, ఒక గొప్ప ధనికుడి వద్ద పనికి కుదిరి, విశ్రాంతి వేళల్లో బరువులు మొయ్యటం దగ్గిర నుంచీ ఏ పని అయినా సంకోచించకుండా చేశాడు. సంవత్సరం పూర్తి అయేసరికి అతడి వద్ద పదివేలు పోగయాయి. అతను దానితో ఒక మంచి రత్నాన్ని కొని, ఇంటికి తిరిగి వచ్చి, దాన్ని తన తండ్రికి ఇచ్చాడు.

"అయ్యో, నాయనా! ధనమే ప్రధానమని అడ్డమైన చాకిరీ చేసి ఎలా అయిపోయావు! నిన్ను చూస్తే నాకు దుఃఖం కలుగుతున్నది రా," అన్నాడు తండ్రి.

రెండోవాడు ఒక సిద్ధవైద్యుడి దగ్గిర శిష్యుడుగా చేరి, ఆయనకు ఎంతో శ్రద్ధా

వి. వేణుగోపాలశర్మ

సక్తులతో శుశ్రూషలు చేసి మెప్పించి, ముసలితనాన్నీ, ముసలితనంలో కలిగే జాడ్యాలనూ పోగొట్టే ఒక గొప్ప ఔష ధాన్ని సంపాదించి, ఇంటికి తిరిగి వచ్చి, ఆ ఔషధాన్ని ఎంతో సంతోషంగా తండ్రికి ఇచ్చాడు.

"నాకు ఈ ఔషధం ఎందుకు, నాయనా ? నేను సమస్త సుఖాలూ అను భవించాను. కృత్రిమంగా తెచ్చిపెట్టు కునే యౌవనం నాకు సంతోషం కలిగిం చదు. ఇది చూసి నేను సంతోషిస్తానని నువు అనుకున్నందుకు నాకు విచారమే కలుగుతున్నది." అన్నాడు తండ్రి.

మూడోవాడు ఒక వృద్ధుడైన గురువు దగ్గిరికి పోయి, "తండ్రి సంతోషించా లంటే కొడుకు ఏం చెయ్యాలి ?" అని అడిగాడు.

"నీకు అభిమానం గల విద్య ఏమిటి?" అని గురువు ఎదురు అడిగాడు.

"నాకు సంగీతమంటే చాలా ఇష్టం," అన్నాడు కుర్రవాడు.

"అయితే సంగీతం నేర్చుకో. అందులో ప్రవీణుడివి అయావంటే నీ తండ్రి సంతో షిస్తాడు," అన్నాడు గురువు.

మూడోవాడు ఒక సంగీత విద్వాంసుడి దగ్గిరికి పోయి, తన దగ్గిర ఉన్న డబ్బంతా ఇచ్చేసి, ఆయన వద్ద సంగీతం నేర్చు కుంటూ అహోరాత్రులు సాధన చేశాడు. ఒక్క ఏడాదిలో వాడు గొప్ప సంగీత విద్వాంసుడై, దేవాలయంలో పాడసా గాడు. అతని పాట విన్న రసికులు తన్మ యులై, రాజుగారికి అతని సంగతి చెప్పారు.

రాజుగారు అతన్ని ఆహ్వానించి, ఆస్థానంలో పాడించి, మెచ్చుకుని, అతన్ని ఆస్థాన విద్వాంసుడుగా నియమించాడు.

తండ్రిని చూసి రావటానికి మూడో వాడు రాజుగారి అనుమతి పొంది, రాజు గారిచ్చిన కానుకలన్నీ తీసుకుని ఇంటికి వచ్చాడు. తండ్రి ఆ కొడుకును చూసి సంతోషించి, "ఇదే తండ్రికి నిజమైన సంతోషం. కొడుకు కీర్తిమంతుడు కావ టంతో తండ్రి ధన్యుడవుతాడు," అన్నాడు.





# దురాశ

గొప్ప పుణ్యక్షేత్రంగా ప్రసిద్ధి కెక్కిన ఒక యాత్రాస్థలానికి ప్రతి రోజూ అనేక మంది యాత్రికులు వస్తూండేవారు. వారి కోసం అక్కడ అనేక ధర్మశాలలు ఉండేవి. ఒక్కొక్క ధర్మశాలకూ ఒక్కొక్క నౌకరు ఉండేవాడు. ధర్మశాలను శుభ్రంగా ఉంచటమూ, అందులో దిగే యాత్రికులకు అవసరమైన సౌకర్యాలు కలిగించటమూ వాడి పని.

ఇలా ఏర్పాటైన నౌకర్లలో రంగన్న అనే వాడు చాలా నిజాయితీపరుడు. ఒక నాడు రంగన్న కింద ఉన్న ధర్మశాలలో ఒక యాత్రికుడు పొరపాటున ఒక బంగారు గొలుసు వదిలిపెట్టి వెళ్ళిపోయాడు. ఆ గొలుసు రంగన్న కంటపడింది. నిజాయితీపరుడైన రంగన్న దాన్ని కాజెయ్యక, తీసుకుపోయి దేవాలయ ధర్మకర్తకు ఇచ్చాడు.

ధర్మకర్త రంగన్న నిజాయితీని మెచ్చుకుని, అతనికి యాభైరూపాయలు బహుమానంగా ఇచ్చాడు.

అది మొదలు దేవాలయ పాలకవర్గం వారు, నిజాయితీగా ఉండే దేవస్థాన నౌకర్లందరికీ యాభయ్యేసి రూపాయలు బహుమతి ఇయ్యాలని నిర్ణయించి, ఈ సంగతి నౌకర్లు అందరికీ తెలియజేశారు.

ధర్మశాలలను కనిపెట్టి ఉండే వాళ్లలో సోమన్న అనే నౌకరు ఒకడు ఉండేవాడు. వాడు రంగన్న లాగా నిజాయితీపరుడు కాడు. ఈ బహుమతులను గురించి వినగానే వాడికి ఎక్కడలేని దురాశా, దాని వెంబడే ఒక దుర్బుద్ధీ పుట్టుకొచ్చాయి.

సోమన్న ఒక పన్నాగం పన్నాడు. అదేమిటంటే, వాడి బంధువు ఎవడో

కోలార్ కృష్ణఅయ్యర్

ఒకడు యాత్రికుడుగా నటిస్తూ వచ్చి, సోమన్న అధీనంలో ఉండే ధర్మశాలలో బస చేసి, ఒక బంగారు నగనో, విలువ గల వస్తువునో వదిలేసి వెళ్ళిపోవటమూ, సోమన్న దాన్ని తీసుకుపోయి ధర్మకర్తకు ఇచ్చి, యాభైరూపాయలు బహుమతిగా పుచ్చుకోవటమూనూ. తరవాత వాడి బంధువులు వచ్చి, ధర్మకర్తగారికి తాము పోగొట్టుకున్న వస్తువుల ఆనవాళ్లు చెప్పి, వాటిని తీసుకుపోయేవారు. ఇలా తరచుగా చేస్తూ సోమన్న బహుమానాల రూపంలో చాలా డబ్బు సంపాదించుకున్నాడు.

కొంతకాలం గడిచిన మీదట ధర్మకర్తకు అనుమానం వేసింది. ఎందుకంటే, ఈ బహుమతుల నిర్ణయం జరిగిన అనంతరం యాత్రికులు ధర్మశాలలలో వస్తువులు మరిచి వెళ్ళటం చాలా ఎక్కువ అయింది. అందులో కూడా సోమన్న అధీనంలో ఉండే ధర్మశాలలో దిగినవాళ్ళే ఇలా వస్తువులు పోగొట్టుకుంటున్నారు. ఇందులో ఏదో విశేషం ఉండాలనుకుని ధర్మకర్త సోమన్నను పరీక్షించ నిశ్చయించాడు.

ఒక రోజున ధర్మకర్త తన బంధువును సోమన్న చూసే ధర్మశాలకు యాత్రికుడుగా పంపాడు. ఆయన వెళ్ళిపోతూ కావాలని తన రవ్వల ఉంగరాన్ని తేలికగా కనిపించే చోట వదిలేసి వెళ్ళాడు. సహజంగా అది సోమన్న కంటపడింది. దాన్ని బయట ఎక్కడ అమ్మినా తేలికగా మూడువందల రూపాయలు వస్తాయి; ధర్మకర్తకు ఇస్తే యాభైరూపాయలే వస్తాయి. అందుచేత సోమన్న దాన్ని కాజేసి, ఇంటికి తీసుకుపోయాడు. తన వెంట ఒక అధికారి వస్తున్న సంగతి సోమన్న ఎరగడు.

సోమన్న తన ఇంట్లోకి పోబోతూండగా ఇద్దరు రక్షకభటులు అతన్ని ఆపి, సోదా చేసి, ఉంగరం తీసుకుని, అతని చేతులకు బేడీలు తగిలించి, జైలుకు పట్టుకుపోయారు.






వాలి ప్రాణాలు ఇంకా పోలేదు. అతను కళ్ళు తెరిచి అటూ ఇటూ చూశాడు. తన కొడుకు దగ్గిర నిలబడి ఉన్న సుగ్రీవుడు కనిపించాడు. వాలి సుగ్రీవుడితో ఇలా అన్నాడు:

"నిన్ను రాజ్యం నుంచి వెళ్ళగొట్టి, నీ భార్యను హరించానని నన్ను తప్పు పట్టకు. మనమిద్దరమూ రాజ్యసుఖం పంచుకోవటమూ, సోదర స్నేహంతో ఉండటమూ రాసిపెట్టిలేక నా బుద్ధి అలా పోయింది. నేను చచ్చిపోతున్నాను గనక, నువు వానర రాజువుకా. నా ఈ చివరి కోరిక ఎంత కష్టమైనా తీర్చు. నాకు ప్రాణం కన్న ఎక్కువైన వాడు అంగదుడు; వాణ్ణి నీ కొడుకులాగే చూసుకో. వాడికి ఏ లోటూ రానీకు. వాడికి ఇక నువు తప్ప ఎవరూ లేరు. వాడు నీ అంత పరాక్రమం గలవాడు: అన్ని విషయాలలోనూ నీకు తోడుగా ఉండగలడు. సుషేణుడి కూతురూ, నా భార్యా అయిన తార చాలా సూక్ష్మబుద్ధి గలది, రానున్న కష్టాలను ముందుగా తెలుసుకోగలదు. అందుచేత ఆమె చెప్పినట్టు చెయ్యి. లేకపోతే నీకు ఆపద కలుగుతుంది. నాకు దేవేంద్రుడిచ్చిన కాంచనమాల ఇప్పుడే నువు తీసుకో. నేను చచ్చిపోతే దీని కాంతి పోతుంది."

వాలి చెప్పినదానికి సుగ్రీవుడు వినయంగా తల ఆడించి, కాంచనమాల తీసుకున్నాడు.



తరవాత వాలి అంగదుణ్ణి దగ్గిరికి పిలిచి, కొన్ని హితాలు చెప్పాడు: అతను తన పట్ల ప్రవర్తించినట్టే, సుగ్రీవుడి పట్లా ప్రవర్తించాలి: సుగ్రీవుడి శత్రువులతో ఎన్నడూ చేరరాదు; సుగ్రీవుడు చెప్పిన పనులు శ్రద్ధగా చెయ్యాలి; ఎవరితోగాని అమిత స్నేహం చెయ్యటం గాని, అసలే స్నేహం చెయ్యకపోవటం గాని తప్పు. ఇలా చెప్పి వాలి ప్రాణాలు వదిలాడు. వానరులందరూ గొల్లున ఏడ్చారు. వాళ్లు వాలి చేసిన మహా కార్యాలు తలుచుకున్నారు.

ఈ వాలి గొలభుడనే గంధర్వుడితో పదిహేను సంవత్సరాలు పోరాడి చంపాడు. వాలి ఉండగా వానరులకు ఎవరి భయమూ లేకపోయింది.

తార తన భర్త కోసం తలుచుకుని, తలుచుకుని ఏడిచింది. నీలుడు వాలి రొమ్ము నుంచి బాణం లాగేశాడు. తార చెప్పిన మీదట అంగదుడు వాలి కాళ్ళు పట్టుకుని నమస్కారం చేశాడు. తార దుఃఖం చూస్తూ సుగ్రీవుడు, తానే వాలిని చంపించి నందుకు మహా బాధపడ్డాడు. అతను కంట నీరు పెట్టుకుంటూ రాముడి దగ్గిరికి వెళ్ళాడు.

అలా వెళ్ళి సుగ్రీవుడు రాముడితో, "రామా, నువు నీ మాట నిలబెట్టుకుని వాలిని చంపావు, నాకు రాజ్యం ఇచ్చావు. కాని నాకు జీవితం మీద కోరిక పోయింది. తారా, వానరులూ ఇలా ఏడుస్తూండగా నాకీ రాజ్యం ఎందుకు? మొదట వాలి నన్ను పెట్టిన బాధల మూలంగా వాలి చావు కోరాను, కాని తీరా వాలి చచ్చి పోయాక పశ్చాత్తాపం నన్ను దహిస్తున్నది. నా జీవితమంతా ఋశ్యమూకం మీదనే వెళ్ళబుచ్చటం మంచిదని తోస్తున్నది. ఇప్పుడు నాకు స్వర్గం కూడా వద్దు. వాలి నన్ను ప్రాణాలతో వదిలాడు. నేను వాలి ప్రాణాలు తీయించాను. నా కంటె పాపి ఉండడు. ఇప్పుడు నేను యువరాజుగా ఉండటానికి కూడా తగను,

రాజును ఎలా కాగలను? నేను కూడా వాలితోపాటు దహనమవుతాను. వానరులు నీ పని చూడగలరు; సీతాదేవిని వెతుకుతారు," అన్నాడు.

తార రాముణ్ణి చూసి దుఃఖిస్తూ ఇలా అన్నది:

"వాలిని చంపిన బాణంతోనే నన్ను కూడా చంపి, వాలి దగ్గిరికి పంపు. నేను వెంట లేకపోతే వాలికి సుఖం లేదు. సీతా వియోగంతో నువు ఎలా బాధపడుతున్నావో, స్వర్గంలో వాలి నా కోసం అలా బాధపడతాడు. నన్ను చంపితే నీకు వాలిని చంపిన దోషం పోతుంది."

రాముడు ఆమెను ఓదార్చుతూ, "వీర పత్నివైన నువు ఇలా దుఃఖించరాదు. వాలి ఉన్నప్పుడు సుఖపడినట్టే నువు మళ్ళీ సుఖపడతావు. ని కొడుకు అంగదుడు యువరాజు అవుతాడు." అన్నాడు.

అతను వానరులతో, "ఎంత ఏడిచినా చచ్చిపోయిన వాడికి అందువల్ల మేలు జరగదు. కాలయాపన ఎందుకు. వాలికి ఊర్ధ్వలోకాలు కలిగె కార్యక్రమం చెయ్యండి," అన్నాడు.

అప్పుడు లక్ష్మణుడు, దుఃఖంలో మునిగి ఉన్న సుగ్రీవుడితో, "సుగ్రీవా, వాలికి దహన సంస్కారం జరగాలి. వానరుల చేత చందనం మొదలైనవి ఎండు కట్టెలు తెప్పించు. అంగదుణ్ణి ఓదార్చి, తండ్రి తలకింద కొరివి పెట్టటానికి అతన్ని సిద్ధం చెయ్యి. ఇక నుంచీ





కిష్కింధను పాలించవలసిన నువు ఏడుస్తూ కూచుంటే జరగదు. అంగదుడి చేత పూలూ, బట్టలూ, నెయ్యీ, నూనే, గంధ ద్రవ్యాలూ వెంటనే తెప్పించు. పల్లకి ఒకటి తీసుకురావాలి. వాలిని మోసే వానరులు సిద్ధంగా ఉండాలి,'' అన్నాడు.

లక్ష్మణుడు ఇలా చెప్పగానే తారుడు పల్లకిని పట్టుకురావటానికి కిష్కింధకు వెళ్ళి, త్వరలోనే తిరిగి వచ్చాడు. సుగ్రీవుడూ, అంగదుడూ కలిసి వాలి శరీరాన్ని పల్లకిలో పడుకోబెట్టారు. సుగ్రీవుడు వాలి శరీరం మీద పూలు కప్పి, పల్లకీ తీసుకుపోయే దారి వెంట పూలు చల్లమని వానరులను ఆజ్ఞాపించాడు. శవం వెంట అంగదుడితోబాటు, వాలి బంధువులైన తారుడు మొదలైన వాళ్లూ, స్త్రీలూ నడిచారు. ఒక వాగు సమీపాన ఇసుకలో చితి ఏర్పరిచారు. తరవాత వాలిని దహనం చేసి, జల తర్పణాలు విడిచారు. రాముడు దగ్గిర ఉండి వానరుల చేత కర్మకాండ అంతా యథావిధిగా చేయించాడు.

సుగ్రీవుడు స్నానం చేసి, తడి బట్టలతో రామలక్ష్మణుల వద్దకు వచ్చాడు. వానరులంతా అతనితోబాటే నిలబడ్డారు. అప్పుడు హనుమంతుడు రాముడితో, ''రామా, నీ దయవల్ల సుగ్రీవుడికి రాజ్యం వచ్చింది. నీ సెలవైతే అతను ఇప్పుడు కిష్కింధ ప్రవేశించి, ఎన్నో పనులు చెయ్యాలి. అతను శాస్త్రోక్తంగా పట్టాభిషేకం చేయించుకుని, నిన్ను తగిన విధంగా సన్మానిస్తాడు. అందుచేత నువు కిష్కింధకు వచ్చి, నీ చేతి మీదుగానే పట్టాభిషేకం జరిపించి, వానరులకు ఆనందం కలిగించు,'' అన్నాడు.

దానికి రాముడు, ''హనుమంతుడా, తండ్రి ఆజ్ఞ ప్రకారం పధ్నాలుగేళ్ళు వనవాసం చెయ్యవలసిన నేను గ్రామాలలోకి గాని, పట్టణాలలోకి గాని ప్రవేశించరాదు. మీరే సుగ్రీవుణ్ణి తీసుకుపోయి, అతనికి



వైభవంగా పట్టాభిషేకం చెయ్యండి. అలాగే ఈ అంగదుణ్ణి యువరాజుగా అభిషేకించండి. శ్రావణమాసం ఆరంభమయింది. నాలుగు నెలల పాటు వర్షాకాలం. యుద్ధానికి తగిన కాలం కాదు. మీరంతా కిష్కింధకు వెళ్ళండి. నేనూ, లక్ష్మణుడూ ఈ పర్వతం మీద ఉంటాం. ఇక్కడ ఉన్న గుహ విశాలంగా, ఉండటానికి చాలా బాగున్నది. పక్కనే నీరూ, పద్మాలూ ఉన్నాయి. తిరిగి కార్తికమాసం వచ్చినప్పుడు రావణుణ్ణి యుద్ధంలో చంపే ప్రయత్నం చేద్దాం.'' అన్నాడు.

ఈ విధంగా రాముడి అజ్ఞ పొంది సుగ్రీవుడు కిష్కింధ ప్రవేశించాడు. వానరులంతా అతన్ని అనుసరించారు. అతను తనను చూడవచ్చిన వానరులనందరినీ పరామర్శించి, తారను ఊరడించటానికి వాలి అంతఃపురానికి వెళ్ళాడు.

సుగ్రీవుడు వాలి అంతఃపురం నుంచి తిరిగి రాగానే వానరులు అతని పట్టాభిషేకం కోసం బంగారు అలంకరణలు గల తెల్ల గొడుగూ, రెండు వింజామరలూ, అన్ని రకాల మణులూ, సమస్త విత్తనాలూ, ఓషధులూ, పూలూ, చందనమూ, అక్షింతలూ, కుంకుమపువ్వూ, తేనే, నెయ్యీ, పెరుగూ మొదలయినవన్నీ సిద్ధం చేశారు. అడవిపంది చర్మంతో కుట్టిన పాదరక్షలు సుగ్రీవుడి కోసం సిద్ధం చేశారు.

తరవాత బ్రాహ్మణులు అగ్నిహోత్రం చేసి, పూజించి, సుగ్రీవుడికి వేదోక్తంగా పట్టాభిషేకం చేశారు. గజుడూ, గవాక్షుడూ, గవయుడూ, శరభుడూ, గంధమాదనుడూ, మైందుడూ, ద్వివిదుడూ, హనుమంతుడూ, జాంబవంతుడూ, నళుడూ బంగారు కలశాలతోనూ, ఎద్దుకొమ్ములతోనూ నదీ జలం తెచ్చి సుగ్రీవుణ్ణి అభిషేకించారు.

రాముడు చెప్పిన ప్రకారం సుగ్రీవుడు అంగదుణ్ణి యువరాజుగా అభిషేకించాడు. అలా చేసినందుకు వానరులు సుగ్రీవుణ్ణి

మెచ్చుకున్నారు. వానరులందరూ పండగ చేసుకున్నారు.

సుగ్రీవుడు రాముడి వద్దకు వెళ్ళి, జరిగినదంతా చెప్పి, తిరిగి వచ్చి, తన భార్య అయిన రుమతో సుఖంగా జీవించ సాగాడు.

రామలక్ష్మణులు వానాకాలం గడప టానికి నిర్ణయించుకున్న గుహ ప్రస్రవణ పర్వతం మీద ఉన్నది. అది చాలా అందమైన పర్వతం. గుహకు సమీపం లోనే తామర కొలను ఉన్నది. గుహ ద్వారం నైరృతి దిక్కుగా ఉండటం చేత వానజల్లు లోపలికి రాదు. తూర్పు నుంచి ఈదురు గాలి కూడా లోపలికి రాదు. గుహ ముందర చక్కని సమ ప్రదేశం ఉన్నది. సమీపంలోనే చక్కని నది కూడా ప్రవహిస్తున్నది. కిష్కింధ అక్కడికి ఎంతో దూరం లేదు. కిష్కింధలో జరిగే కోలాహలమూ, వాద్యాల ధ్వనులూ గుహకు స్పష్టంగా వినిపించాయి.

అలాటి అందమైన ప్రదేశంలో ఉంటూ రాముడు ఒక వంక సీత కోసం విరహ పడుతూ, రావణుణ్ణి చంపటానికి సుగ్రీవుడు సహాయ పడతాడని ఆశపడుతూ, శరత్కాలం కోసం ఎదురు చూడసాగాడు. అతనికి ఆ వానాకాలం చాలా కష్టం మీద గడిచింది.



చివరకు వానలు వెనకపడ్డాయి. కాని సుగ్రీవుడు రాముడి పని సంగతి పూర్తిగా మరిచిపోయాడని హనుమంతుడికి తోచింది. సుగ్రీవుడు రాజ్యభారమంతా మంత్రులకు వదిలేసి, పూర్తిగా తన కాలమంతా స్త్రీలతో సుఖించటంలో ఇన్నాళ్ళూ గడిపాడు. అతను తన భార్యను రుమనేగాక, తన అన్న భార్యను తారను కూడా తన భార్య చేసుకున్నాడు.

ఇది గమనించిన హనుమంతుడు సుగ్రీవుడి వద్దకు వెళ్ళి, "నీకు రాజ్యమూ, వైభోగమూ వచ్చాయి. స్నేహితుల పట్ల బాధ్యత కూడా నిర్వర్తించు. సొంత పనులు పాడు చేసుకుని అయినా మిత్రుల

పనులు చూసేవాడు నశించడు. మనం ఇప్పుడు రాముడి కోసం సీతను వెదక వలసి ఉన్నది. ఈ పని ఇప్పటికే ప్రారంభం కావలిసింది. రాముడు మంచి వాడు గనక ఓపిక పట్టాడు. సీతను వెదకటానికి వానరులను పంపించు," అన్నాడు.

సుగ్రీవుడికి ఈ మాటతో తొందరకలిగింది. అతను నీలుణ్ణి పిలిచి, అన్ని దిక్కులా ఉన్న వానరసేనలను పిలిపించమని ఆజ్ఞాపించాడు; పదిహేను రోజుల లోపల కిష్కింధకు వచ్చి చేరని వానరులందరికీ మరణదండన ప్రకటించాడు.

ఈ లోపల రాముడు, వర్షకాలం పోయినా సుగ్రీవుడు రాక పోయేసరికి, చాలా బాధపడ్డాడు. అతను లక్ష్మణుడితో, "సుగ్రీవుడు శరత్కాలం రాగానే సీతను వెతికిస్తానని మాట యిచ్చి, తన పని తీరిందిగదా అని ఉపేక్షిస్తున్నాడు. అతనికి నా బాణం దెబ్బతినాలని కోరికగా ఉన్నట్టున్నది. నువు వెళ్ళి, నేను కోపంగా ఉన్నానని అతనితో చెప్పు. వాలిని పంపిన మార్గాన సుగ్రీవుణ్ణి కూడా పంపగలనని చెప్పు. వాలిని ఒక్కణ్ణే చంపాను; సుగ్రీవుడు మాట తప్పితే అతన్నీ, అతని బంధువులనూ కూడా చంపుతాను. ఇదంతా అతనికి ఎలా చెప్పాలో అలా చెప్పు," అన్నాడు.

లక్ష్మణుడికి కూడా సుగ్రీవుడి పైన చాలా కోపం వచ్చింది.

"ఈ సుగ్రీవుడు తనకు రాజ్యం ఎలా వచ్చినదీ మరిచాడు. అతని రాజ్యం నిలవదు. నే నిప్పుడే వెళ్ళి, ఆ సుగ్రీవుణ్ణి చంపి, అంగదుడి సహాయంతో సీతాదేవిని వెదికిస్తాను," అంటూ లక్ష్మణుడు బయలుదేరేసరికి, రాముడు అతన్ని ఆపి, "లక్ష్మణా, అంత పని చెయ్యకు. మనకూ అతనికీ మధ్య ఉన్న స్నేహాన్ని మరవకు. సుగ్రీవుడితో మంచిగానే మాట్లాడు. అతను జాప్యం చేశాడే తప్ప, మనకు అపచారం ఏమీ చెయ్యలేదు," అన్నాడు.






అర్థినా ముపపన్నానాం
పూర్వం చాప్యుపకారిణాం,
ఆశాం సంశ్రిత్య యో హన్తి
స లోకే పురుషాధమః. 1

[పూర్వం తనకు ఉపకారం చేసిన వాళ్ళూ, యోగ్యులూ అయిన వాళ్ళు సహాయం కోరినప్పుడు మాట ఇచ్చి వంచన చేసేవాడు లోకమంతటిలోకీ అధముడు.]

శుభం వా, యది వా పాపం,
యో హి వాక్య ముదీరితం,
సత్యేన ప్రతిగృహ్ణాతి
స వీరః పురుషోత్తమః. 2

[మంచిగానీ, చెడుగానీ, తాను ఇచ్చిన మాట నిలబెట్టుకున్నవాడు వీరుడూ, పురుషోత్తముడూనూ.]

కృతార్థా హ్యకృతార్థానాం
మిత్రాణాం న భవన్తి యే,
తా న్మృతా నపి క్రవ్యాదాః
కృతఘ్నా న్నోపభుఞ్జతే. 3

[ఉపకారం చేసిన మిత్రులకు అవసరానికి ప్రత్యుపకారం చెయ్యని వారిని చచ్చిన తరవాత కాకులూ, గద్దలూ కూడా తినవు.]

ప్రత్యుపకారం

Photo by P. V. Subramanyam



బహుమతి పొందిన వ్యాఖ్య

వ్యర్థం కాని చదువు

పంపినవారు : గంధం భవాని

Photo by K. K. Rao




కొత్తపేట,
గుంటూరు - 1.

అర్థం కాని చదువు

బహుమతి
పొందిన వ్యాఖ్య:

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు





★ వ్యాఖ్యలు మార్చి 20వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైన మాత్రమే రాయాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు మే నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:

స్నానం

మూడవ అట్ట:

స్నానానంతరం

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications

# ఆత్మరక్షణలో తొలిపాఠం

నాన్నా, ఇవ్వాళ నన్ను సునీల్ కొట్టాడు.
తిరిగి ఎందుకు కొట్టలేదు? ఆత్మరక్షణ నీవు నేర్చుకోవాలి.




లేకపోతే మణికట్టుతో దెబ్బ తప్పించుకోవచ్చు.




ఇవ్వాళటికి చాలు — ఆత్మరక్షణ కోసం — బాక్సింగ్‌లో ఇది తొలి పాఠం.




లేదు అబ్బాయి, దంతక్షయ కారకమైన ఆహార అణువులన్నిటినీ తొలగించివేయుటకు నీవు నీ పళ్లను ప్రతి రాత్రీ ప్రతి ఉదయం తోముకోవాలి. నీవు ఇగుళ్లను కూడా రుద్దుకోవాలి.








ఆదర్శమూర్తియైన భర్త పండంటి బిడ్డలు నిండు నెలయేరులా సాగిపోయే
జీవితాన్ని ఆమె ఎందుకు బలి చేసుకుంది?
ముప్పలనేని శేషగిరిరావు సమర్పించు
రవిశంకర్ ఆర్ట్ పిక్చర్స్
రంగనాయకమ్మ నవల
బలిపీఠం
ఈస్ట్మన్ కలర్
నిర్మాత
వై. సునీల్ చౌదరి
మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం
దాసరి నారాయణరావు
సంగీతం చక్రవర్తి
కెమెరా
ఎడిటింగ్ కె. సత్యం
ఆర్ట్ కళాధర్
నిర్వహణ సుబ్బారావు
సోల్ డిస్ట్రిబ్యూటర్స్
అనిల్ ప్రభాస్
ఎంటర్ ప్రైజెస్
నవయుగ
VEEKAY

